జనరంజక గ్రంథావళి 12



# ధరలు : వాటి తీరుతెన్నులు

రచయిత

శ్రీ తాళ్లూరు నాగేశ్వరరావు ఎం.కాం; ఎల్ ఎల్. బి

డిప్యూటీ డైరక్టరు, తెలుగు అకాడమి, హైదరాబాదు



తెలుగు అకాడమి

హైదరాబాదు

1983

Popular Series dharalu vaati teeru tennulu (Prices and Their Trends) · Author . Sri Talluri Nageswara Rao ; First Edition, 1983 p. p vi + 86





First Edition, 1983
Copies : 1,000

Published by TELUGU AKADEMI, Hyderabad — 500029, (Andhra Pradesh) under the Centrally Sponsored Scheme of Production of Books and Literature in Regional languages at the University level, of the Government of India in the Ministry of Education and Social Welfare (Department of Culture), New Delhi.



Price : Rs. 2-50

**PRINTED IN INDIA**

Text at T. S. Printers, Lalapet, Guntur - 522 003

Cover at Swatantra Art Printers, Vijayawada - 7.

Andhra Pradesh

# భూమిక

ఇంటర్మీడియట్, డిగ్రీ తరగతులకు అవసరమైన పాఠ్య, పఠనీయ గ్రంథాలను, అనువాద వాఙ్మయాన్ని, మోనోగ్రాఫ్‌లను ఇంతవరకు తెలుగు అకాడమి ప్రచురించి విద్యార్థుల, అధ్యాపకుల, విద్యావేత్తల ఆదరాభిమానాలను విశేషంగా, చూరగొన్నదని వేరే చెప్పనక్కర్లేదు అయితే అంతటితో తనబాధ్యత తీరినట్లుగా అకాడమి భావించడంలేదు. కొత్తగా చదువునేర్చుకొన్న వారికి, పాఠ్య ప్రణాళికలతో నియత విద్యారంగంతో (formal education field) సంబంధం లేకుండ జ్ఞానోపార్జన చేయదలచిన వారికి,విద్యార్థులకు, అధ్యాపకులకు జనరంజక గ్రంథావళి వల్ల ప్రయోజనముంటుందని భావిస్తున్నాము. నిత్యజీవితంలో సన్నిహిత సంబంధమున్న వివిధ శాస్త్రాంశాల విజ్ఞానాన్ని, సమకాలీన సమస్యల పరిష్కారాల పరిజ్ఞానాన్ని అందరికి అందించే సదుద్దేశంతో, సరసమైన ధరలకు ఈగ్రంథాలను వెలువరిస్తున్నాము. ప్రయోజనాత్మకమైన తెలుగు సదస్సు సిఫార్సుల మేరకు ఈ గ్రంథాల ప్రచురణను చేపట్టినాము. వివిధ రంగాలలో ప్రాయోగికానుభవంగల నిపుణులను రచయితలుగా ఎన్నుకొన్నాము. భాష సరళంగాను, అందరికి అర్థమయ్యే రీతిలోనూ, సాధ్యమయినంత తక్కువ సాంకేతిక పదజాలంతో ఉండేటట్లు రచించే ప్రయత్నం జరిగింది. అంతేగాకుండా ఇచ్చిన సమాచారము ఆధికారికంగా ఉండేటట్లు తగిన శ్రద్ధ తీసుకొన్నాము ఈగ్రంథాలు అందరి ఆదరాభిమానాలకు పాత్రమౌతాయని ఆశిస్తున్నాము.

విమర్శకులు సహృదయంతో ఇచ్చేసూచనలను పునర్ముద్రణలో తప్పక పరిశీలించగలము.

# ప్రవేశిక

ఈనాడు ధరల పెరుగుదల ప్రపంచ పరిణామంగా మారింది. ప్రపంచంలో ప్రతిదేశంలోనూ ధరలు అంతో ఇంతో మారుతున్నాయి. ధరల పెరుగుదల తీరు తెన్నులను, కారణాలను, ధరలపెరువల ప్రభావాలను ఈపుస్తకంలో చర్చించడం జరిగింది. ధరలపెరుగుదల ప్రవృత్తి 'డయాబిటిస్' వ్యాధిని పోలినటువంటిది. స్వల్ప కాలిక దీర్ఘకాలిక చర్యల ద్వారా దానిని కంట్రోల్ చేయవచ్చుగానీ, పూర్తిగా అరికట్టడం సాధ్యం కాదు. ధరలను అదుపులో పెట్టడానికి ప్రభుత్వం తీసుకొన్న తీసుకొంటున్న, తీసుకోవాల్సిన చర్యలను ఈ గ్రంథంలో సూచించడం జరిగింది. ధరలకు మారే నైజం ఉంది కాబట్టి, ఇందులో యిచ్చిన గణాంకాలు సంప్రదింపు పరంగానే ఉపయోగపడగలవని మనివి చేయడమైంది.

# విషయ సూచిక

# 1

## విషయ పరిచయము

దేశ కాల మార్పులకు ధరలు ముంజేతి కంకణం వలె ప్రతిబింబిస్తాయనడంలో అతిశయోక్తి ఏమాత్రం లేదు. మొదటి ప్రపంచ యుద్ధానికి ముందూ, ఆ తర్వాతా; రెండో ప్రపంచ యుద్ధానికి ముందూ, ఆ తర్వాతా; రెండు దశాబ్దాలకు ముందూ, ఆ తర్వాతా దేశ దేశాల్లో ఉన్న ధరలనూ, వాటి పెరుగుదల తత్వాన్నీ పరిశీలిస్తే పై వాక్యంలో వాస్తవికత మనకు సులభంగా అవగాహన కాగలదు. ధరల పెరుగుదల (**Price rise**) ఆధునిక ప్రపంచపు వైఖరిగా మారిపోయింది. ఈనాడు ప్రపంచంలో ప్రతి దేశంలోనూ ధరల పెరుగుదల ధోరణి (**trend of price rise**) గోచరిస్తూన్నది. ప్రపంచంలో ఏ దేశంలో ధరలు స్థిరంగా ఉన్నాయో, ఏ దేశంలో ధరలు అతి స్వల్పంగా మార్పులకు గురవుతున్నాయో, ఏ దేశపు ఆర్థిక వ్యవస్థ ధరల ప్రభావానికీ, ప్రవర్తనకూ, ధోరణులకూ తామరాకుమీద నీటిబిందువు వలె నిర్లిప్తంగా ఉందో చెప్పడం అంత సులభం కాదు. కమ్యూనిస్టు దేశాలైన రష్యా, చైనాలు కూడా ధరల పెరుగుదల భూతానికి దూరంగా ఉండలేక పోతున్నాయి. అయితే ఆ దేశాల్లో ధరల పెరుగుదల మిగతా దేశాలకంటె స్వల్పంగా ఉందనీ, ఆర్థిక వ్యవస్థపై అంతగా ప్రభావం లేదనీ కొంతమంది అభిప్రాయం. ఏది ఏమైనా ధరల పెరుగుదల ధోరణి ఆర్థికాభివృద్ధి చెందిన దేశాల్లోనూ, పారిశ్రామికీకరణ హెచ్చుగా జరిగిన దేశాల్లోనూ, ఆర్థికాభివృద్ధి చెందుతూన్న దేశాల్లోనూ, ఆర్థికంగా వెనకబడిన దేశాల్లోనూ కొద్దో గొప్పో తేడాలతో దాదాపు అన్ని దేశాల్లోనూ ఇప్పుడు ప్రస్ఫుటంగా కనబడుతూన్నది. ధరల పెరుగుదల ప్రవృత్తి ఆధునిక ప్రపంచ పరిణామంగా చెప్ప వచ్చు.

ప్రాచీన కాలంలో ధరల పెరుగుదల ప్రసక్తి ఏమంత ఉండేది కాదు. వస్తు వినిమయార్థిక వ్యవస్థ (barter economy) గల కాలంలో, వస్తువులను ఇచ్చి పుచ్చుకోవడం ద్వారా వ్యవహారాలు జరుపుకొనే కాలంలో, వర్తక, వ్యాపార, వాణిజ్య, పారిశ్రామిక కార్యకలాపాలకు మానవుడు అలవాటు పడకముందు, ద్రవ్యార్థిక వ్యవస్థ (money economy) ప్రవేశించక ముందు ప్రజలకు వస్తువుల ధరలతో నిమిత్తం ఉండేది కాదు. తన దగ్గర మిగులు ధాన్యం ఉంటే, తనకు మేకమాంసం కావల్సి వస్తే, కొంత ధాన్యాన్ని ఇచ్చి మేకను తీసుకొనేవాడు. వస్తు వినిమయ పద్ధతిలో విలువ కొలమానం ఉండేది కాదు. వస్తువులకు కచ్చితమైన ధరలు ఉండేవి కావు. కాని అట్లాంటి అనాగరిక సమాజంలో మానవుడు ఎంతకాలం ఉండగలడు ? వస్తు వినిమయార్థిక వ్యవస్థలో మానవుని ప్రపంచం పరిమితంగా ఉండేది, కోర్కెలు పరిమితంగా ఉండేవి; వ్యవహారాలు పరిమితంగా జరిగేవి. దేశకాల పాత్రోచితంగా మానవుడు, నాగరికత, ఆచార వ్యవహారాలు, సంస్కృతి వికాసం పొందసాగాయి. ద్రవ్యం అమల్లోకి వచ్చింది.వస్తు వినిమయార్థిక వ్యవస్థలోగల ఇబ్బందులు, సమస్యలు తొలగి పోయాయి. ద్రవ్యం వినిమయ మాధ్యంగా (medium of exchange), విలువ కొలమానంగా (measure of value), విలంబిత చెల్లింపులకు ప్రమాణంగా (standard for deferred payments), విలువల బదిలీకి సాధనంగా (means of transfer of values), నిల్వలకు విలువగా (store of value) విధులను నిర్వహించడంతో ప్రతి వస్తువుకూ ధరలు ఏర్పడినాయి. ద్రవ్య ఆర్థిక వ్యవస్థలు క్రమంగా అన్ని దేశాల్లోనూ చోటు చేసుకున్నాయి. పేపరు కరెన్సీ మిగుల ప్రాచుర్యంలోకి రావడంతో ధరలకు ప్రాముఖ్యం హెచ్చింది.

ఇంగ్లాండ్‌లో పద్దెనిమిదో శతాబ్దం చివర ప్రారంభమైన పారిశ్రామిక విప్లవం (industrial revolution) ప్రజల ఆర్థిక జీవనంలో అనూహ్యమైన మార్పులు తెచ్చింది. ఈ మార్పులు పరిణతి చెందడానికి ఒక శతాబ్ద కాలం పట్టినప్పటికీ దేశ దేశాల్లో పారిశ్రామికీకరణ పెద్ద ఎత్తున జరిగింది. ఎన్నో కొత్త యంత్రాలను, పద్ధతులను ఆ కాలంలో కనుక్కోవడమైంది. అప్పటి ఆర్థిక వ్యవస్థల

రూపురేఖలు మారిపోవడానికి పారిశ్రామిక విప్లవం ఎంతో దోహదం చేసింది. శక్తికి మూలాధారంగా ఆవిరిని (steam) కనుక్కోవడంతో ఉత్పత్తి, పంపిణీ పద్ధతుల్లో విప్లవాత్మకమైన మార్పులు వచ్చినాయి. ఫ్యాక్టరీలు వెలిశాయి. ఉత్పత్తి అధికమైంది. దేశావసరాల దృష్ట్యా కాకుండా ఇతర దేశాల అవసరాలను దృష్టిలో పెట్టుకొని ఉత్పత్తి కొనసాగడంతో వస్తువులు భారీఎత్తున తయారు కాసాగినాయి. వర్తక, వాణిజ్య, వ్యాపార, పారిశ్రామిక కార్యకలాపాలు విస్తృతమైనాయి. పారిశ్రామిక విప్లవం ప్రాధమికంగా ఎన్నో ఆర్థిక, సామాజిక, రాజకీయ, పారిశ్రామిక మార్పులను తెచ్చింది. ధనిక స్వామ్యవర్గం (Capitalist class) బయలుదేరింది. ఉత్పత్తి పద్ధతుల్లో, ఫ్యాక్టరీ వ్యవస్థలో, భారీఉత్పత్తిలో, శ్రమ విభజనలో (division of labour), ప్రత్యేకీకరణలో (specialisation), వస్తువుల వైవిధ్యంలో, మార్కెట్ల విస్తరణలో, వర్తక, వాణిజ్యాల పెంపుదలలో, విదేశ వ్యాపారంలో, రవాణా, కమ్యూనికేషన్ సాధనాలలో అభివృద్ధికరమైన మార్పులు వచ్చినాయి. ఉద్యోగావకాశాలు పెరిగినాయి. ప్రజల జీవన ప్రమాణం స్థాయి హెచ్చడానికి దోహదకారి అయింది. అయితే పారిశ్రామిక విప్లవం కొన్ని సామాజిక దుష్ఫలితాలను తావు కల్పించక పోలేదు. పెట్టుబడిదార్లు తమ స్వలాభం కోసం కార్మికుల్ని దారుణంగా దోచుకున్నారు. కార్మికులు, యజమానులు అనే వర్గాలు సమాజంలో రెండుగా బలపడ్డాయి. కొద్దిమంది చేతుల్లో ఆర్థిక శక్తి, ఐశ్వర్యం కేంద్రీకృతం కావడంతో, సామాజిక అసంతృప్తి, అశాంతి వ్యాపించసాగినాయి. తమ హక్కుల రక్షణకోసం, తమ శ్రేయస్సును కాపాడుకోవడం కోసం కార్మికులు సంఘాలుగా ఏర్పడ్డారు. పారిశ్రామిక విప్లవం ఎన్నో రకాలుగా మార్పులు తెచ్చినప్పటికీ ఎన్నో కొత్త వస్తువులు వెలుగులోకి వచ్చినాయనీ, వాటికి ధరలు నిర్ణయించడం జరిగిందనీ, ధరల యంత్రాంగం అనే భావనకు అంకురార్పణ ఏర్పడిందనీ చెప్పవచ్చు.

పారిశ్రామిక విప్లవానంతరం దేశ దేశాల్లో ప్రజల వేషభాషల్లో కానివ్వండి, నాగరికతలో కానివ్వండి, ఆచార వ్యవహారాల్లో కానివ్వండి సత్వరం మార్పులు వచ్చినాయి. తన చుట్టూ

ఉన్నదే ప్రపంచం కాదనీ, తనకు తెలియని ప్రపంచం మరెంతో ఉన్నదనీ, తాను కూపస్థ మాండూక్యం వలె ఉంటే లాభం లేదనీ మానవుడు తెల్సుకున్నాడు. మానవునిలో-ఆలోచనలు, ఆకాంక్షలు, ఆశయాలు, ఆశలు విశాల ప్రాతిపదికపై పెంపొందాయి. కొన్ని వస్తువులను వినియోగించడం ద్వారా, కొన్ని వస్తువులను సొంతం చేసుకోవడం ద్వారా తన జీవన ప్రమాణాన్ని పెంచుకోవచ్చుననీ, సమాజంలో హోదాను నిల్పుకోవచ్చుననీ, తన వారి బ్రతుకులకు భద్రత చేకూర్చవచ్చుననీ మానవుడు గ్రహించాడు. దానితో నికి సంపాదనపై అభిలాష పెరిగింది. కష్టించి పనిచేసో, తెలివి .టల్ని ఉపయోగించో, వర్తక వ్యాపారాలు కొనసాగించో, వృత్తిని ర్వహించో సమకాలీన ఆర్థిక వ్యవస్థలో తన కాళ్ళమీద తాను ృశంగా నిలబడటానికి ప్రయత్నాలు చేయసాగాడు. లాభార్జనపై, సొంత ఆస్తులు ఏర్పర్చుకోవడంపై. సమాజంలో ఉన్నతంగా బతికడంపై దృష్టిని మానవుడు కేంద్రీకరించినాడు.

ప్రపంచంలో క్రమేపీ అన్ని దేశాల్లోనూ పారిశ్రామికీకరణ ఎక్కువ కాసాగింది. వ్యవసాయం, పరిశ్రమలు, రవాణా, వనరుల వినియోగం, వార్తా ప్రసార సాధనాలు, వివిధ వృత్తులు, వర్తక, వాణిజ్యాలు, బ్యాంకింగ్, ప్రజోపయోగ సేవలు మొదలైన రంగాలు అభివృద్ధి చెందాయి. చిన్నతరహా పరిశ్రమలు మధ్యతరహాకు మారి పెద్ద తరహా పరిశ్రమలుగా రూపొందాయి. వనరులు, పెట్టుబడి, కార్మికులు మొదలైన ఉత్పత్తి కారకాల లభ్యతతో వస్తువులను భారీ ఎత్తున ఉత్పత్తి చేయడం ప్రారంభమైంది. ప్రపంచంలో ఒక దేశంలో తయారైన వస్తువులను మరో దేశానికి ఎగుమతి చేయడానికి, దేశంలో ఒక ప్రాంతంలో ఉత్పత్తి అయిన సరుకులను మరో ప్రాంతానికి పంపిణీ చేయడానికి సదుపాయాలు ఏర్పడ్డాయి. ఈ మానవ నాగరికత వికాస పరిణామాన్ని అనుసరించి వస్తువుల ఉత్పత్తీ, వాటికి ధరలూ, ఆ ధరలలో డిమాండ్–సప్లయ్ సూత్రం ప్రకారం హెచ్చు తగ్గులూ అమల్లోకి వచ్చాయి.

ఫ్యాక్టరీలో గానీ, మరెక్కడైనా గానీ వస్తువు తయారైనప్పుడే, లేదా ఆహార ధాన్యాలు పండినప్పుడే; లేదా సేవలు అర్దుబాటులోకి వచ్చినప్పుడే – వాటికి ధరలు నిర్ణయించడం

జరుగుతుంది. ఒక వస్తువుకు ధరను నిర్ణయించాలంటే కొన్ని పద్ధతులను అనుసరించవలె. ఏ పద్ధతి అనుసరించినా కొన్ని అంశాలను పరిగ్రహణలోకి తీసుకోవలె. వస్తువు తయారు కావడానికి ఎంత ఖర్చయిందో, ధాన్యం పండించడానికి ఎంత వ్యయమైందో, ఒక సేవను అందించడంలో ఇమిడి ఉన్న ఖర్చులేమిటో, వాటి ఉత్పత్తిదారుకు, మధ్య దళారుకు, ప్రభుత్వానికి, చిల్లర వర్తకునికీ ఎంత మార్జిన్ ఉండవలెనో; సప్లయ్–డిమాండ్ పరిస్థితి ఏమిటి మొదలైన అంశాలను పరిగణించిన తర్వాత స్థూలంగా వస్తువులకు గానీ, ముడి పదార్థాలకు గానీ, సేవలకు గానీ ధరలు నిర్ణయించడం జరుగుతుంది. ఒక సాధారణ ఉదాహరణ గమనించండి : ఒక పుస్తకాన్ని ప్రచురించి, ధర నిర్ణయించడం.ఒక పుస్తకపు వ్యయ పత్రంలో (Cost sheet) కింది అంశాలు ఇమిడి ఉంటాయి :

రచయితకిచ్చే ప్రతిఫలము
పుస్తకాన్ని అచ్చువేయడానికి ఉపయోగించే కాగితం ఖర్చు
పుస్తకాన్ని అచ్చువేయడానికి ఖర్చులు
పుస్తకం టైటిల్ డిజైనింగ్ చేయించడానికి ఆర్టిస్టుకిచ్చే పారితోషికము
బ్లాకులు తయారు చేయించడానికి అయ్యే వ్యయము
టైటిల్ పేపరు ఖరీదు
టైటిల్ ప్రింటింగ్ ఖర్చు
పుస్తకం అమ్మకందార్లకిచ్చే కమీషన్
ప్రచురణ కర్తకు లభించవల్సిన లాభం మార్జిన్
పుస్తకం పబ్లిసిటీకి అయ్యే వ్యయము
పుస్తకం పంపిణీకి అయ్యే ఖర్చులు

పై అంశాలనన్నింటినీ దృష్టిలో పెట్టుకొని పుస్తకానికి ధరను నిర్ణయించవలె. అదే విధంగా వస్తువుకు గానీ, సేవకుగానీ ధరను నిర్ణయించడానికి ఎన్నో అంశాలను దృష్టిలో ఉంచుకోవలసి ఉంటుంది. ఈ ధరల నిర్ణయం కొన్ని సూత్రాల ఇనుప చట్రానికి పరిమితమై ఉండదు, సంకోచ వ్యాకోచాలతో, నిర్ణీతమైన ఆర్థిక

సూత్రాలతో, వైయక్తిక అభిలాషలతో కూడుకొని ఉంటుంది. వస్తువుల ధరల నిర్ణయంలో ప్రభుత్వం జోక్యం, అజమాయిషీ, నియంత్రణ ఉన్నప్పటికీ కొన్ని వస్తువుల ధరల నిర్ణయంలో పెట్టుబడిదారే ఎక్కువ పాత్ర నిర్వహిస్తాడు. కొన్ని వస్తువులకు ప్రభుత్వం ధరలు నిర్ణయించినప్పటికీ ఆ వస్తువులు అదే ధరలకు మార్కెట్‌లో లభించక పోవచ్చు. వస్తువులకు ధరలు నిర్ణయించడంలో ఉత్పత్తిదార్లు ఎక్కువ లాభాలను ఆశించి ద్రవ్యోల్బణ ధోరణులకు కారకులవుతున్నారనీ, వస్తువుల పంపిణీ చేసే మధ్య దళారులు ఎక్కువ మార్జిన్ విధించి ధరల పెరుగుదలకు కారణభూతులవుతున్నారనీ, కొంతమంది బ్లాక్ మార్కెటింగ్ వంటి అవాంఛనీయమైన పద్ధతులను అవలంబించి, వస్తువులను అక్రమంగా నిల్వచేసి ధరల పెంపునకు తోడ్పడుతున్నారనీ కొంతమంది వాదన. ఈ వాదనలో అసత్యమేమీ అంతగా కనబడదు.

## ధరలు ఎందుకు మారాలి ?

ప్రపంచం మారుతున్నది; దేశాలు మారుతున్నాయి; దేశాలను పరిపాలించే ప్రభుత్వాలు మారుతున్నాయి; కాలాలు మారుతున్నాయి. ఆర్థిక, సామాజిక, పారిశ్రామిక, వర్తక, వాణిజ్య, వ్యాపార, రాజకీయ పరిస్థితులు మారుతున్నాయి. ప్రకృతి మారుతూన్నది. సిద్ధాంతాలు మారుతున్నాయి. మనుషులు, విలువలు మారుతున్నాయి. నిత్యమూ 'మార్పు'కు గురయ్యే ప్రపంచంలో వస్తువులకు ధరలు స్థిరంగా ఉంటాయా ? కాబట్టి ధరలు మారడంలో ఆశ్చర్యం లేదు. అత్యద్భుతం లేదు. ప్రపంచంలో మార్పు అనేది సాధారణ విషయమైనప్పుడు ధరలు మారడంకూడా అంతకంటె సాధారణ విషయం కావడంలో అతిశయోక్తి ఏమీ లేదు.

సర్వసామాన్యంగా వస్తువులకు ధరలు ఒక్కసారిగా పెరగవు. యుద్ధాలు, కరువు కాటకాలు, దేశంలో అనిశ్చిత రాజకీయ పరిస్థితులు, పెట్టుబడిదారుల్లో స్పెక్యులేషన్ ప్రవృత్తి, ప్రకృతి భీభత్సాలు మొదలైన సందర్భాలలో తప్ప ధరలు మామూలుగా క్రమేపీ పెరుగుతాయి. కొన్ని వస్తువులకు ప్రాచీనకాలంలో ఉండే

ధరలను, ప్రస్తుతకాలంలో ఉండే ధరలను పోల్చి చూస్తే, మనం విపరీతమైన విస్మయానికి గురి అవుతాము.

కౌటిల్యుని అర్థశాస్త్రంలో నిత్యావసర ధరలను గురించి ప్రస్తావన ఉంది. ఆ కాలంలో మణుగు బియ్యం పావలాకు, ఉప్పు రెండు పైసలకు లభించేవని వ్రాశారు. అదే విధంగా ఆఫ్రికన్ యాత్రికుడు ఇబెన్ బటూటా 13వ శతాబ్దంలో మన దేశం వచ్చినట్లు చరిత్ర చెబుతూన్నది. ఆ యాత్రికుని వ్రాతల ప్రకారం ఆనాటి వస్తువుల ధరలు ఈనాటి కరెన్సీ ప్రకారం ఇట్లా ఉన్నాయని చెప్ప వచ్చు :

| | |
|---|---|
| 40 కిలోల గోధుమలు | — 20 పైసలు |
| 40 కిలోల యవలు | — 11 పైసలు |
| 40 కిలోల బియ్యం | — 44 పైసలు |
| 40 కిలోల సెనగలు | — 11 పైసలు |

పైన పేర్కొన్న వస్తువులను ఇప్పటి ధరలతో పోల్చుకుంటే మనం విపరీతంగా ఆశ్చర్యపోతాము.

ఉదాహరణకు పాలు, నెయ్యి ధరలు వివిధ కాలాలలో ఎట్లా ఉన్నాయో కింది పట్టికను బట్టి తెలుసుకోవచ్చు :

| సంవత్సరం | పాలు (కిలోధర) | నెయ్యి (కిలోధర) |
|---|---|---|
| 1911 | 12-5 పైసలు | 42-5 పైసలు |
| 1939 | 15-0 | 1-25 రూ |
| 1953 | 55-0 | 5-00 ,, |
| 1960 | 87-5 | 7-50 ,, |
| 1968 | రూ 1-25 | 10-00 ,, |
| 1972 | రూ 1-50 | 17-25 ,, |
| 1980 | రూ 2-25 | 25-00 ,, |

| | | |
|---|---|---|
| 1981 | రూ 2-75 | 28-50 రూ |

పైన ఇచ్చిన ఉదాహరణలో పాలు, నెయ్యి పదార్థాలు ఉన్నాయి. అయితే బియ్యం, గోధుమలు, పంచదార, ఇనుం, ఉక్కు, వస్త్రాలు, సిమెంట్, విలాస వస్తువులు మొదలైన వాటి ధరలుకూడా పరిశీలిస్తే 1911 నాటికీ 1981 నాటికీ దాదాపు పై పట్టికలోని వ్యత్యాసాలు గోచరిస్తాయి.

ధరలు ఎందుకు మారాలి, మారుతున్నాయి అనే ప్రశ్నకు డిమాండ్, సప్లయ్ ఆర్థిక సూత్రాలనే కాకుండా అతి సామాన్య ప్రజలకు అర్థమయ్యే అనేక కారణాలను చెప్పుకోవచ్చు. వాటిల్లో ముఖ్యమైనవి :

i) జనాభా పెరుగుదల
ii) వస్తు, సేవలకు డిమాండ్
iii) మూలధనం వస్తువులపై హెచ్చు రేటుతో కూడుకున్న పెట్టుబడి
iv) ప్రభుత్వాల రాజకీయ అస్థిరత
v) ప్రభుత్వ వ్యయాల పెరుగుదల
vi) లోటుదారీ ఆర్థిక విధానము (deficit financing)
vii) ద్రవ్యం సప్లయ్‌లో హెచ్చుదల
viii) దేశపు ఆర్థికాభివృద్ధి ప్రక్రియ
ix) నల్లధనం ప్రభావం
x) యుద్ధాలు, క్షామాలు, వరదల భీభత్సం మొదలైనవి
xi) వస్తూత్పత్తిలో మాంద్యం
xii) ప్రైవేటు వర్తకంపై ప్రభుత్వపు ఆంక్షలు, అజమాయిషీ.
xiii) ప్రభుత్వ పంపిణీ యంత్రాంగంలో లోపాలు
xiv) గరిష్ఠ ధరల నిర్ణయంలో తప్పిదాలు
xv) దేశపు ఎగుమతులు, దిగుమతుల మధ్య తీవ్రమైన అగాధం.

xvi) పెద్ద పెద్ద వ్యాపార సంస్థల పెరుగుదల
xvii) ఆడంబర వినియోగంపై ఆంక్షలు లేకపోవడం
xviii) దేశంలో లంచగొండితనం పెరిగిపోవడం
xix) విదేశాలనుంచి డబ్బు అధికంగా, అక్రమంగా రావడం
xx) బ్యాంకులు సృష్టించే పరపతిపై నియంత్రణ సరిగా లేకపోవడం.
xxi) ప్రత్యక్ష పన్నులను తక్కువగా, పరోక్ష పన్నులను హెచ్చుగా విధించడం.

పైన పేర్కొన్న కారణాలన్నీ ధరలు ఎందుకు మారతాయో తెలియజేస్తాయి. ఈ కారణాలను గురించి రానున్న అధ్యాయాలలో స్పష్టంగా చర్చించడమవుతుంది.

## ఆధునిక ఆర్థిక వ్యవస్థలో ధరల పాత్ర

అర్థశాస్త్రజ్ఞుడ్ని గురించి ఆస్కార్ వైల్డ్ (Oscar wilde) ఇట్లా అన్నాడు : "అర్థశాస్త్రజ్ఞుడు అనేవాడు ప్రతి వస్తువుయొక్క ధరను తెలుసుకొని, ఏ వస్తువుయొక్క విలువను తెలియనివాడు" (An economist is someone who knows the price of everything and the value of nothing). అర్థశాస్త్రజ్ఞుని గురించిన పై హాస్య వ్యాఖ్యానంలో వాస్తవం అంతగా లేదు. అర్థశాస్త్రజ్ఞునికి ప్రతి వస్తువుయొక్క ధర నిజంగా తెలియదు. వస్తువుల విలువలు తెల్సిన అర్థశాస్త్రజ్ఞులు ప్రపంచంలో కోకొల్లలుగా ఉన్నారు. ఆస్కార్ వైల్డ్ వ్యాఖ్యానంలో అంతరార్థమేమిటంటే - అర్థశాస్త్రజ్ఞులు ధరల పద్మవ్యూహంలో సతమతమవుతూ వుంటారని, వస్తువుల విలువల్ని గురించి పట్టించుకోరని, ఆధునిక ఆర్థిక వ్యవస్థలో (modern economy) ధరలు నిర్వహించే పాత్ర అత్యంత ప్రముఖమైందని ప్రత్యేకంగా చెప్పనక్కర్లేదు.

ధరలు —

ప్రజల ఆర్థిక జీవనంపై ప్రభావం చూపుతాయి.

ప్రజల జీవన స్థాయి హెచ్చు తగ్గులకు కారణభూతమవుతాయి.

ప్రజల కొనుగోలు అలవాట్లను మారుస్తాయి.

దారిద్ర్యరేఖను (Poverty line) మరీ దిగువగా దిగజారడానికి దోహదపడతాయి.

స్పెక్యులేషన్ వ్యాపార వ్యవహారాలను ఇనుమడింపజేస్తాయి.

ఆర్థిక వ్యవస్థ స్థిరత్వాన్ని అల్లల్లాడిస్తాయి.

ఉత్పత్తి పద్ధతుల్లో మార్పులు తెస్తాయి.

నిరుద్యోగితకు దారి తీస్తాయి.

పొదుపు, పెట్టుబడుల్లో మార్పులకు కారణభూత మవుతాయి.

ఆర్థిక వ్యవస్థ అంటే ఏమిటి ? ఆర్థిక వ్యవస్థకు చాలమంది అర్థశాస్త్రజ్ఞులు చాలరకాలైన నిర్వచనాలిచ్చారు. ఆ నిర్వచనాలతో మనకు నిమిత్తం లేదు. పైపెచ్చు ఆర్థిక వ్యవస్థ నిశ్చలమైంది కాదు. అది ఒక దశనుంచి మరోదశకు మారుతూ ఉంటుంది. ప్రపంచంలో అనేక రకాలైన ఆర్థిక వ్యవస్థలున్నాయి. బాగా అభివృద్ధి చెందిన ఆర్థిక వ్యవస్థలు (developed economies); అభివృద్ధి చెందుతూన్న దశలో ఉన్న ఆర్థిక వ్యవస్థలు (developing economies); వెనక బడివున్న ఆర్థిక వ్యవస్థలు (backward economies); పారిశ్రామిక ఆర్థిక వ్యవస్థలు (industrial economies); మిశ్రమ ఆర్థిక వ్యవస్థలు (mixed economies); వ్యావసాయిక ఆర్థిక వ్యవస్థలు (agricultural economies); పెట్టుబడిదారీ ఆర్థిక వ్యవస్థలు (capitalistic economies); సామ్యవాద ఆర్థిక వ్యవస్థలు (socialistic economies), కమ్యూనిస్టు ఆర్థిక వ్యవస్థలు (communist economies) మొదలైన రకరకాల ఆర్థిక వ్యవస్థలున్నాయి. ఒక్కొక్క ఆర్థిక వ్యవస్థలో ధరల ప్రవర్తన, ధోరణి, ప్రభావం ఒక్కొక్క రకంగా ఉంటుంది. ఆర్థిక వ్యవస్థను కచ్చితంగా నిర్వచించడం కష్టం. ఎందుకంటే అది కంటికి కనిపించే వస్తువు కాదు; పట్టుకోనిచూసే పదార్థం కాదు. ఆర్థిక వ్యవస్థ అనేది స్థూలంగా సమాజం యొక్క ఒక అంశం. ఒకానొక దృక్పథంతో పరిశీలించే సమాజాన్ని కూడా ఆర్థిక వ్యవస్థగా పరిగణించవచ్చు. ఆర్థిక వ్యవస్థ అనే భావనను అనుభవజ్ఞులైన అర్థశాస్త్రజ్ఞులు కూడా మాటల్లో ఇరికించడానికి ఇబ్బంది పడుతూ ఉంటారు.

రాబర్ట్ డోర్ఫ్‌మాన్ (Robert Dorfman) అభిప్రాయం ప్రకారం "ఆర్థిక వ్యవస్థలో సామాజిక నియమాలు, ఆచారాలు, సంస్థలు చేరిఉంటాయి. మార్పిడి చేయదగిన వస్తుసేవల తయారీలో, వర్తకంలో, వినియోగంలో సమాజంలోని సభ్యులు ఏ విధంగా సమన్వయించడమవుతుందో అవి కంట్రోల్ చేస్తాయి". మార్పిడి చేయదగిన వస్తుసేవలు ఆర్థికమైనటు వంటివి. ఆర్థిక వ్యవస్థకు ఆర్థిక సమన్వయం (economic co-ordination) మౌలిక ప్రాతిపదిక. దానినే ధరల వ్యవస్థగా పరిగణించవచ్చు. అయితే ఆర్థిక వ్యవస్థలో ధరలతో నిమిత్తంలేని అంశాలు కొన్నిఉన్నాయి. ఉదాహరణకు - విద్య, న్యాయ వ్యవస్థ, వైద్య సౌకర్యాలు మొదలైన వాటితో ధరల వ్యవస్థకు సంబంధం లేదు.

ఆధునిక ఆర్థిక వ్యవస్థలో ధరల వ్యవస్థకు అత్యంత ప్రాముఖ్యమున్నదని ఆర్థిక శాస్త్రజ్ఞులు అంగీకరిస్తారు. ద్రవ్యోల్బణం (inflation) ఆర్థికాభివృద్ధికి దోహదకారి అని షుంపీటర్, ఆల్విన్, హాన్‌సన్, విర్లి.జె. హామిల్టన్ మొదలైన అర్థశాస్త్రజ్ఞులు భావిస్తున్నారు. ఆర్థిక సమన్వయంలో ధరల వ్యవస్థ పాత్ర ఏమాత్రం సార్థక్యమైందో అనే విషయంపై కొన్ని సందేహాలు లేక పోలేదు. కేవలం ధరల వ్యవస్థపై ఆధారపడడం అంత శ్రేయస్కరం కాదని కూడా కొంతమంది అర్థశాస్త్రజ్ఞుల అభిప్రాయం. సోవియట్ రష్యాలో ముఖ్యమైన ఆర్థిక నిర్ణయాలన్నీ విస్తృతమైన లెక్కింపుల ఆధారంగా ధరలతో నిమిత్తం లేకుండానే తీసుకోవడం జరుగుతుంది. ప్రస్తుతం ఆర్థికాభివృద్ధి దశలో ఉన్న పెక్కుదేశాలు ధరల వ్యవస్థపై ఆధారపడకుండా కేంద్రీకృత ప్లానింగ్, నిర్దేశక సూత్రాలను అవలంబించడం ద్వారానే తమ లక్ష్యాలను సమర్థవంతంగా సాధించవచ్చునని గ్రహించాయి.

ధరల వ్యవస్థ (Price system) అంటే ఏమిటి ? ధరల వ్యవస్థ అనేది ఆర్థిక వ్యవస్థలో ఒక భాగం. అందులో ప్రతి వ్యక్తి (సంస్థలు, కార్పోరేషన్లు మొదలైన వాటితో సహా) ఆర్థిక వ్యవస్థకు ఏ వస్తువును లేదా సేవను అందిస్తున్నాడు; ఆ వస్తువును గానీ, సేవనుగానీ తనకూ, ఇతర్లకూ అందుబాటులో ఉండే ధరకు అమ్ము తున్నాడా ? ఇతర్లు అందించే వస్తుసేవలను అంగీకార యోగ్యమై

సంఖ్య తక్కువగా ఉండి, అవకాశాలు పరిమితంగా ఉండి, అర్హతలు గలవారి సంఖ్య ఎక్కువగా ఉంటే తగిన ఉద్యోగాలు లభించక పోవచ్చు. అట్లాంటి సందర్భాలలో ఆర్థికావశ్యకతను (economic necessity) బట్టి తక్కువ ఉద్యోగాల్లో చేరడం సంభవిస్తుంది. ఇంజనీరింగ్ అర్హతలుగల అభ్యర్థి గుమాస్తా ఉద్యోగంలో చేరవల్సి వస్తుంది. బ్యాంకులో చేరవల్సిన బి. కాం. పట్టభద్రుడు బస్సు కండక్టరే కావల్సి వస్తుంది. వస్తూత్పత్తికి శ్రామిక శక్తి అవసర మవుతుంది. వేతనాలను ఆశించి శ్రామికులు పనిచేస్తారు. శ్రామిక బలం ఉత్పత్తి కారకాలలో ఒకటి. యజమానులు శ్రామికులకు చెల్లించే వేతనాలు. ఉద్యోగులకు చెల్లించే జీతాలు ధరల యంత్రాంగంలో ప్రాముఖ్యాన్ని వహిస్తాయి.

ప్రభుత్వమూ, ఆర్థిక సంస్థలూ, శాస్త్రవేత్తలూ శ్రామికులకు, ఉద్యోగులకు టోకు (wholesale) లేదా చిల్లర (retail) లేదా వినియోగదార్ల (consumers) ధరల సూచీ ప్రకారం వేతనాలను, జీతాలను చెల్లించడం జరుగుతుంది. ధరల సూచీలలో అప్పుడప్పుడు కలిగే మార్పుల ననుసరించి వేతనాలను, జీతాలను పెంచడమవుతుంది. ఆ సూచీల ప్రకారం కరువు భత్యాన్ని పెంచమని కార్మికులు, ఉద్యోగులు డిమాండ్ చేస్తూ ఉంటారు.

వినియోగదార్లు తమ కోర్కెలకు కళ్ళెం తగిలించి, అదుపులో పెట్టే శక్తిని, ఆవశ్యకతను ధరల వ్యవస్థ కలిగిస్తుంది. ఉత్పత్తికీ, వినియోగానికీ సామరస్యాన్ని కలిగించడానికి, రెండు కారకాల సక్రమ విధుల నిర్వహణకు ధరల యంత్రాంగం(mechanism of prices) తోడ్పడుతుంది. దేశంలో ఎక్కడ ఉత్పత్తి అయిన వస్తు, సేవలు వినియోగదార్లకు తెలియవలె; అందుబాటులో ఉండవలె. పంజాబ్‌లో ఒక చిన్న పట్టణంలో ఉత్పత్తి అయిన ఉన్ని దుస్తులు ఆంధ్ర ప్రదేశ్‌లో ఒక చిన్న పట్టణానికి చేరతాయి. రవాణా, పంపిణీ మార్గాలు పటిష్ఠంగా ఉన్నప్పుడు విదేశాలలో తయారయ్యే వస్తువులు కూడా మారుమూల గ్రామాలకు చేరతాయి. ఉత్పత్తి చరమలక్ష్యం వినియోగమే. వినియోగంతో నిమిత్తం లేని, వినియోగదార్ల ఉపయోగానికి పనికి రాని ఉత్పత్తి వ్యర్థమే కాగలదు. అందుచేత ఉత్పత్తిదారు ఎప్పుడూ వినియోగ

దార్లు డిమాండ్ చేసే వస్తుసేవలనే ఉత్పత్తి చేస్తాడు. తాను ఉత్పత్తి చేసిన వస్తుసేవను వెంటనే మధ్య దళారుల ద్వారానో, సొంత ఏజన్సీల ద్వారానో, చిల్లర వర్తకుల ద్వారానో వినియోగదార్లకు చేరేటట్లు చూస్తాడు. కొత్తగా ఏయే వస్తువులు తయారవుతున్నాయో, అవి ఎక్కడెక్కడ లభిస్తున్నాయో, ఆ వస్తువుల గుణ దోషాలెనిటో వినియోగదారునికి తాజాగా తెలియవలసిన అవసరం ఎంతైనా ఉంది. సమాచార సిద్ధాంతం (information theory) ఈ అవసరాన్ని తీరుస్తూన్నది. వార్తాపత్రికలు, మ్యాగజైన్లు, వర్తకపు పత్రికలు (trade journals), రేడియో, వాల్ పోస్టర్లు, అమ్మకాల ఉద్యమాలు (Sales campaigns) మొదలైన వాటిద్వారా వస్తుసేవల సమాచారాన్ని వినియోగదార్లకు ఎప్పటికప్పుడు తెలియజేయడం జరుగుతూన్నది. ధరల స్థిరీకరణకు, ధరలలో వ్యత్యాసాలు ఉండకుండా చూడటానికి వ్యాపార ప్రకటనలు సహకరిస్తాయి.

### ధరల పెరుగుదల అంటే ఏమిటి ?

ధరల పెరుగుదల స్థితి మనం కళ్ళారా చూసేది; వినేది, చెప్పుకొనేది. గత సంవత్సరానికీ, ఈ సంవత్సరానికి నిత్యావసర వస్తువుల ధరల్లో ఉన్న వ్యత్యాసం ఎక్కువగా ఉంటే ధరలు పెరుగుతున్నాయనుకుంటాం. ఉదాహరణకు, క్వింటాల్ బియ్యం ధర 1980 లో 225 రూ. ఉంటే, 1981 లో రూ. 250 ఉంటే బియ్యం ధర పెరిగిందంటాము. ఇట్లా ప్రతి వస్తువులో కొద్దో, గొప్పో సంవత్సర సంవత్సరానికీ ధరలు పెరుగుతూంటే ధరల పెరుగుదల స్థితి ఏర్పడుతుంది. ధరల పెరుగుదల స్థితి స్థిరమైంది కాదు. కాలంతో పాటు మారుతూ ఉంటుంది. ధరల పెరుగుదలను ద్రవ్యోల్బణం (inflation) అని కూడా అంటారు.

ద్రవ్యోల్బణాన్ని అనేక రకాలుగా నిర్వచించవచ్చు; వర్ణించవచ్చు. చాలా ఎక్కువ డబ్బు చాలా తక్కువ వస్తువుల వెంటబడటం; చాల తక్కువ వస్తువులతో చాలా ఎక్కువ మొత్తంలో అరువు(credit) పోటీపడటం; ద్రవ్య వేతనాలు (money wages), వ్యయాలు ధరలను వెంటాడటం; ధరలు వేతనాలను, వ్యయాలను

వెంటాడటం, వస్తువుల సప్లయ్ కంటె డిమాండ్ అత్యధికంగా ఉండటం మొదలైన లక్షణాలన్నీ ద్రవ్యోల్బణానికి చిహ్నాలు. ధరల పెరుగుదల లేదా ద్రవ్యోల్బణ స్థితి ద్రవ్య సంబంధమైన వ్యవహారం ఒక్కటే కాదు. దాన్ని రాజకీయ వ్యవహారంగా, సామాజిక వ్యవహారంగా అభివర్ణించవచ్చు. ద్రవ్యోల్బణ మనేది ఎన్నో వ్యవహారాలతో, అంశాలతో కూడుకున్నది. ఏది ఏమైనప్పటికీ ద్రవ్యోల్బణాన్ని ముఖ్యంగా ద్రవ్య సంబంధమైన, ఆర్థిక పరమైన వ్యవహారంగానే ఆర్థిక వేత్తలు భావిస్తారు. వస్తువుల ప్రవాహానికీ (flow of goods) ద్రవ్య సంబంధమైన డిమాండ్ కూ (monetary demand) అసమతౌల్యం లేదా అగాధం లేదా అసామరస్యం ఉండటమే ఆర్థిక వ్యవస్థలో ద్రవ్యోల్బణ స్థితి ఏర్పడటానికి ముఖ్యమైన హేతువు. పై సందర్భంలో వస్తువులంటే – నిత్యావసర వస్తువులు. అంతేగాని విలాస వస్తువులు (luxury goods) కాదు. నిత్యావసర వస్తువుల (basic commodities) ధరలు స్థిరమైన స్థాయిలకు వచ్చే వరకూ ఏ ఆర్థిక వ్యవస్థలోనైనా ద్రవ్యోల్బణం నిరాటంకంగా కొనసాగుతూనే ఉంటుందనడంలో అతిశయోక్తి లేదు.

## ద్రవ్యోల్బణంలో రకాలు

ద్రవ్యోల్బణ లక్షణాలను అవగాహన చేసుకోవడానికి ద్రవ్యోల్బణంలో గల రకాలను తెలుసుకోవడం మంచిది. అన్ని రకాల ద్రవ్యోల్బణాలకు ద్రవ్యం సప్లయ్ లో విస్తరణ మూలస్థానం అయినప్పటికీ, ద్రవ్యాత్మక ద్రవత్వ ఆస్తుల (monetary liquid assets) పెరుగుదల కూడా ఒక కారణంగా చెప్పవచ్చు. ఇప్పుడు మనం అనేక వస్తువుల ధరల పెరుగుదలను చూస్తున్నాము. గత నాలుగైదు సంవత్సరాల నుంచీ ధరల పెరుగుదల స్వైర విహారం చేస్తూన్నది. నిత్యావసర, విలాస వస్తువులే కాకుండా స్థిరాస్తుల (immovable goods) విలువల్లో కూడా పెరుగుదల విపరీతంగా గోచరిస్తూన్నది. కొన్ని వస్తువుల ధరలు ఆర్నెల్ల కొకసారి పెరుగుతూంటే, మరికొన్ని వస్తువుల ధరలు మూడునెలల కొకసారి పెరుగుతున్నాయి; ఇంకొన్ని వస్తువుల ధరలు నెలకొకసారి పెరుగుతున్నాయి. వారానికొకసారి, రోజుకొకసారి ధరలు పెరిగే వస్తువులు కూడా లేకపోలేదు.

వస్తువుల ధరల పెరుగుదల స్థితిని లేదా ద్రవ్యోల్బణ స్థితిని రకరకాలుగా విభజించవచ్చు. అర్థశాస్త్రజ్ఞులు ద్రవ్యోల్బణ లక్షణాలను దృష్టిలో పెట్టుకొని ద్రవ్యోల్బణాన్ని కింది రకాలుగా విభజించినారు.

*1.* వేతనాల పెంపు ద్రవ్యోల్బణము (Wage - Push Inflation) : ట్రేడ్ యూనియన్ నాయకులు, ప్రభుత్వ, ప్రభుత్వేతర ఉద్యోగ సంఘాల నాయకులు తమ బేరమాడే శక్తిని వినియోగించి జీవన వ్యయసూచీ (Cost of living index)లో మార్పులు వచ్చినప్పట్నుంచీ వేతనాలు, జీతాలు పెంచడానికి తీవ్రమైన ఆందోళనలు జరపడం కద్దు. తత్ఫలితంగా కార్మికులకు వేతనాలు, ఉద్యోగులకు జీతాలు కరువుభత్యం పెంచడంద్వారానో, అలవెన్సులు పెరగడం ద్వారానో, బేసిక్ జీతంలో కరువుభత్యం కలపడం ద్వారానో, ఇంటి అద్దె అలవెన్సు పెంచడం ద్వారానో అప్పుడప్పుడూ పెరుగుతూ ఉంటాయి. ట్రేడ్ యూనియన్ నాయకుల వొత్తిడికి భయపడి ఫ్యాక్టరీ యజమానులు కార్మికుల వేతనాలను, అనుషంగిక సౌకర్యాలను పెంచుతారు. ఈ విధంగా పెంచడం వల్ల అయ్యే వ్యయాన్ని ఫ్యాక్టరీ యజమానులు తయారీ వస్తువుల ధరలు పెంచడంద్వారా రాబట్టుకోవటం ఉంటుంది. అందుచేత వస్తువుల ధరలు పెరుగుతాయి. వస్తువుల తయారీలో శ్రామిక వ్యయం (labour cost) ప్రత్యేక వ్యయము. కాబట్టి శ్రామికుల వేతనాలు పెరిగినప్పుడల్లా స్వల్పకాల వ్యవధిలో యజమానుల లాభాలలో ఎక్కువ వ్యత్యాసం రాకుండా వస్తువుల ధరలు పెరగడం సహజము. కరువుభత్యం, ఇంటి అద్దె అలవెన్సు, సాంఘిక భద్రత చర్యలు మొదలైన వాటి నిమిత్తం ప్రభుత్వ, ప్రభుత్వేతర ఉద్యోగులు ఆందోళనలు జరుపుతూ ఉంటారు. సమ్మెలు చేస్తూ ఉంటారు. తత్ఫలితంగా అప్పుడప్పుడూ రాష్ట్ర, కేంద్ర ప్రభుత్వాలు ఉద్యోగులకు జీతాలు పెంచడం, ఇంటి అద్దె అలవెన్సులు పెంచడం, ఇతర త్రా సౌకర్యాలు కల్పించడం జరుగుతూ ఉంటుంది. దీనివల్ల ప్రభుత్వ ఖజానాకు వ్యయం హెచ్చు అవుతుంది. ఆ వ్యయాన్ని ప్రభుత్వం పూడ్చుకోవడానికి వస్తువుల మీద పన్నులు విధించవలసి ఉంటుంది. అందువల్ల వస్తువుల ధరలు పెరుగక తప్పదు. ఈ విధమైన ధరల పెరుగుదల స్థితిని లేదా

ద్రవ్యోల్బణాన్ని వేతనాల పెంపు ద్రవ్యోల్బణంగా అభివర్ణించ వచ్చు. కార్మికుల వేతనాలు, ఉద్యోగుల జీతాలు పెరగడం - తత్కారణంగా వస్తువుల ధరలు పెరగడం ఈ తరహా ద్రవ్యోల్బణం ప్రధాన లక్షణము.

*2. డిమాండ్ పెంపు ద్రవ్యోల్బణము* (**Demand - Pull Inflation**) : పూర్ణోద్యోగిత (**full employment**) సందర్భంలో ఇట్లాంటి ద్రవ్యోల్బణాన్ని కీన్స్ రూపొందించినాడు. వస్తుసేవలకు సప్లయ్‌కంటె డిమాండ్ హెచ్చుగా ఉన్నప్పుడు ద్రవ్యోల్బణం తలెత్తుతుంది. ఈ ద్రవ్యోల్బణ స్థితిలో వస్తుసేవలకు మొత్తం డిమాండ్, ప్రైవేటు వినియోగపు డిమాండ్ మొత్తం, ప్రైవేటు పెట్టుబడి డిమాండ్, ప్రభుత్వ వినియోగపు, పెట్టుబడి డిమాండ్ - ఇవన్నీ ఆర్థిక వ్యవస్థయొక్క స్వల్పకాలిక ఉత్పాదక శక్తి కంటె హెచ్చుగా ఉంటాయి. ఈ అగాధాన్ని ధరల స్థాయిలో పెంపుదల ద్వారా పూడ్చవలసి వస్తుంది. వినియోగపు డిమాండ్‌ను బలవంతంగా తగ్గించుకోవలసి వస్తుంది.

*3. లాభాల ద్రవ్యోల్బణము* (**Profit inflation**) : లాభాల ద్రవ్యోల్బణం అనే భావనను కీన్స్ (**Keynes**) తన 'Treatise on **Money**' అనే గ్రంథంలో ప్రవేశపెట్టినాడు. కీన్స్ అభిప్రాయం ప్రకారం పెట్టుబడి విజృంభణ (**investment boom**), కూలి పోవడం వల్ల లాభాల ద్రవ్యోల్బణానికి ఆస్కార మేర్పడుతుంది. వినియోగ వస్తువుల ధర-స్థాయి అనేది పొదుపులమీాద పెట్టుబడి యొక్క ఆధిక్యత. మూలధన వస్తువుల ధరల స్థాయి పెట్టుబడి వస్తువుల (**investment goods**) అసలు ఖరీదుకు సంబంధించి ద్రవత్వం కాని ఆస్తుల (**non-liquid assets**) యొక్క డిమాండ్ స్థాయి ప్రభావానికి లోనై ఉంటుంది. కీన్స్ గ్రంథంలో గాలిపాటు లాభాలు (**windfall profits**) పొదుపులను మించిన పెట్టుబడికి సమానమని సిద్ధాంతీకరించడమైంది. ద్రవ్యోల్బణ విశ్లేషణ కర్తలకు (**inflation analysts**) పెట్టుబడి విజృంభణకు (**investment boom**), లాభాలకు, పొదుపులకు దగ్గరి సంబంధముున్నదనే విషయాన్ని ఆ గ్రంథం తేటతెల్లం చేసింది.

*4. ఎగుమతి - విజృంభణ ద్రవ్యోల్బణము* (Export - Boom Inflation) . ద్రవ్యోల్బణ రకాలలో ఇది అతి మామూలైంది. ఒక దేశపు ఎగుమతి వస్తువులకుగానీ, సేవలకుగాని డిమాండ్‌లో విజృంభణ ఏర్పడితే ఇట్లాంటి ద్రవ్యోల్బణానికి ఆస్కారం కలుగుతుంది. ఈ ద్రవ్యోల్బణానికి ముఖ్యంగా రెండు కారణాలను చెప్పుకోవచ్చు. ఒక దేశంలో ఎగుమతి వస్తువులను ఉత్పత్తిచేసే సామర్థ్యం హఠాత్తుగా పెరగవచ్చు. లేదా ఒక దేశపు వస్తువులకు అంతర్జాతీయంగా డిమాండ్ గాలిపాలు కారణాలవల్ల ఏర్పడవచ్చు. అంతే కాకుండా ఒక దేశంలో విలువైన లోహాలకు హఠాత్తుగా అంతర్జాతీయ డిమాండ్ ఏర్పడవచ్చు. అట్లాంటప్పుడు ఆ దేశపు చెల్లింపుల శేషం (balance of payments) కరెంట్ ఖాతాలో మిగులు విశేషంగా కనబడుతుంది. తత్ఫలితంగా దేశీయ ద్రవ్యం సప్లయ్‌లో విస్తరణ గోచరిస్తుంది. ఎగుమతి ఆర్జనలు (Export earnings) స్థాయికి చేరుకోకుండా దిగుమతులను ఆ దేశపు ప్రభుత్వం అనుమతించక పోవచ్చు. ప్రత్యామ్నాయంగా మరో కారణాన్ని కూడా చెప్పుకోవచ్చు. అదేమంటే, దేశంలోని ప్రజలయొక్క వ్యయపు అలవాట్లు - కొత్త ఆర్జనలను మింగల్చవచ్చు; పెట్టుబడిగా వినియోగపడవచ్చు.

*5. దిగుమతి వస్తువుల ధరల పెంపు ద్రవ్యోల్బణము* (Import price hike Inflation) : విదేశ వ్యాపార ఫలితంగా ఇట్లాంటి ద్రవ్యోల్బణం కలిగే అవకాశముంది. వస్తువులను ఎగుమతి చేసే దేశంలో ద్రవ్యోల్బణ ఫలితాలు ఆ వస్తువులను దిగుమతి చేసుకొనే దేశంలో ప్రభావాన్ని చూపడం సహజము. A అనే దేశం ఆహార ధాన్యాలను B అనేదేశానికి ఎగుమతి చేస్తుందనుకోండి. A దేశంలో ద్రవ్యోల్బణ ఒత్తిడులవల్ల ధరలు హెచ్చుగా ఉంటే, B దేశంలో కూడా ఆవస్తువుల ధరలు సహజంగా పెరుగుతాయి. దిగుమతి చేసుకొన్న ప్రాథమిక వస్తువుల (basic goods) ధరలలో పెరుగుదల వల్ల దేశీయ ఉత్పత్తి తగ్గిపోవచ్చు, దేశీయ ప్రత్యామ్నాయ వస్తువులను ప్రవేశపెట్టడం ఖరీదుతో కూడుకున్నది కావచ్చు, లేదా దేశీయ వస్తువులపై ధరల పెంపు ప్రభావం ప్రత్యక్షంగా పడవచ్చు. వీటివల్ల దేశంలో బ్యాంకు పరపతి విస్తరణ ప్రవృత్తి అధికం కావచ్చు. బడ్జెట్ సంబంధమైన లోట్లు ఏర్పడవచ్చు. అత్యవసర

వస్తువుల ధరలు పెరగవచ్చు. అప్పుడు వేతనాల పెంపు అనివార్యమవుతుంది.

6. పరపతి ద్రవ్యోల్బణము (credit Inflation) : ప్రపంచ ప్రఖ్యాత అర్థశాస్త్రజ్ఞులు షుంపీటర్ (Schumpeter), విక్సెల్ (Wicksell) అనేవారు పరపతి ద్రవ్యోల్బణాన్ని ప్రతిపాదించినారు. ఇది దేశీయమైంది గానీ, అంతర్జాతీయమైంది కాదు. అభివృద్ధి చెందుతూన్న దేశాలలో పరపతి ద్రవ్యోల్బణానికి హెచ్చు అవకాశాలు ఉంటాయి. ఉదాహరణకు భారతదేశము. మనదేశంలో బ్యాంకులు, ద్రవ్య సహాయక ఆర్థిక సంస్థలు, వడ్డీ వ్యాపారస్థులు పరపతిని విస్తరించడం వల్ల ఎన్నో ఫ్యాక్టరీలు, చిన్నతరహా పరిశ్రమలు, వ్యాపార సంస్థలు ప్రారంభమవుతున్నాయి. వస్తువులు తయారవుతున్నాయి. తెచ్చిన అప్పులు తీర్చడానికి వస్తువుల ధరలను పెంచవల్సి వస్తూన్నది. వడ్డీరేట్లు కూడా హెచ్చుగా ఉంటున్నాయి. బ్యాంకులు వినియోగ ఋణాలను (consumption loans) ఇవ్వడం వల్ల మధ్యతరగతి ఆదాయ వర్గాలవారు ఫ్రిజిడేర్లు, రేడియోలు, టి. వి. లు, ఫర్నిచర్, గృహోపకరణాలు మొదలైన వాటిని వాయిదా పద్ధతుల మీద కొనుగోలు చేసి స్వంతం చేసుకొంటున్నారు. బ్యాంకులు అందించే పరపతి విస్తరణవల్ల వినియోగ వస్తువుల ధరలు పెరగడాన్ని ప్రత్యక్షంగా చూస్తున్నాము. విక్సెల్ పరిశీలన ప్రకారం ఋణాలయొక్క అధికమైన వడ్డీరేటు (ద్రవ్య మార్కెట్ పరిస్థితులవల్ల సంభవించేవి) పరపతి విస్తరణకు (Credit Expansion), ఉత్పాదకతకు (Productivity), ధరల పెరుగుదలకు దారితీయటం కద్దు. షుంపీటర్ అభివృద్ధి పరమైన ద్రవ్యోల్బణం (developmental inflation) సిద్ధాంతం ప్రకారం అభివృద్ధి చెందుతూన్న ఆర్థిక వ్యవస్థలలో క్రొత్త వస్తువులను కనుక్కోవడం, వాటి ఉత్పత్తికి పరపతి విస్తరణ జరగడం సర్వసాధారణము. వృత్తాకారపు పెరుగుదల (Circular growth) పరిస్థితులలో, అట్లాంటి పెరుగుదలకు దీర్ఘకాలంలో వడ్డీరేటు సమానమవుతుంది. క్రొత్త వస్తువుల ఉత్పత్తి ప్రక్రియలో పరపతి విస్తరణ ఒక భాగమై ఉంటుంది. క్రొత్తసంస్థలు, క్రొత్తవ్యాపారనాయకులు అవతరిస్తారు. క్రొత్త వస్తువులు, క్రొత్త ఉత్పత్తి పద్ధతులు, క్రొత్త వ్యాపార

వ్యవస్థలు రూపొందుతాయి. ప్రజల కొనుగోలు శక్తిలో మార్పులు సంభవిస్తాయి. వనరులు జోరుగా వినియోగమవుతాయి. వడ్డీరేటు హెచ్చుతుంది. ధరలు పెరుగుతాయి. వాస్తవిక వినియోగపు స్థాయిలు (real consumption levels) దిగిపోతాయి. కొత్త వస్తువులు స్థిరపడటంతో, వాటి యజమానులు లాభాలు పొందుతారు. వస్తువుల అమ్మకాల సామ్యంతో, చేసిన అప్పులను తీర్చడం మొదలు పెడతారు. అప్పుడు ప్రతి ద్రవ్యోల్బణ (deflation) పరిస్థితులు వాటంతట అవే ఏర్పడతాయి. షుంపీటర్ యొక్క అభివృద్ధిపరమైన ద్రవ్యోల్బణ సిద్ధాంతం ఆధునిక మేధావులలో సంచలనాన్ని కలిగించిందని చెప్పవచ్చు.

7. ఆస్తుల ద్రవ్యోల్బణము (Real Estate Inflation) : ఇళ్ళు, స్థలాలు మొదలైన ఆస్తుల కొనుగోలు, అమ్మకాలద్వారా గత రెండు దశాబ్దాలలో ఎంతోమంది ఆకస్మికంగా కోటీశ్వరులైన వారు ఉన్నారు. ముఖ్యంగా బొంబాయి, హైదరాబాద్, త్రివేండ్రం మొదలైన పట్టణాలలో స్థిరాస్తుల కొనుగోలు, అమ్మకాల వ్యాపారం హెచ్చుగా జరుగుతూన్నది. 1965లో హైదరాబాద్‌లో గజం రూ. 5 లకు కొన్నస్థలం 1981 లో గజం రూ. 500 లకు అమ్ముడు పోతూన్నదంటే ఆశ్చర్యపడక్కర్లేదు. గత నాలుగైదేళ్ళుగా కొన్ని నగరాలలో స్థిరాస్తుల విలువ ఊహకు అందనంతగా పెరిగిపోయింది. ఆస్తుల అమ్మకాల, కొనుగోలు వ్యాపారం ఎక్కువగా జరగడానికి విదేశాలనుంచి డబ్బు విరివిగావచ్చి పడటం ఒక కారణంగా చెప్పడం జరుగుతూన్నది. అమెరికా, గల్ఫ్ దేశాలలో ఉన్న భారతీయ డాక్టర్లు, ఇంజనీర్లు, శాస్త్రజ్ఞులు, ఇతర సాంకేతిక నిపుణులు తాము సంపాదించిన ధనాన్ని ఇళ్ళు, ఇళ్ళస్థలాల కొనుగోళ్ళలో వెచ్చించడంవల్ల కొన్ని పట్టణాలల్లో ధరలు ఊహాతీతంగా పెరుగుతున్నాయని కొందరి అభిప్రాయము. ఆకస్మిక లాభాల ప్రభావం, విదేశీ ధన ప్రవాహం మొదలైన వాటివల్ల వినియోగ, విలాస వస్తువుల కొనుగోలు హెచ్చి, ధరలు పెరగడంలో ఆశ్చర్యం లేదు.

పైన వివిధ రకాల ద్రవ్యోల్బణాలను సంగ్రహంగా వివరించడం జరిగింది. ఈ రకాలు సార్వజనీనంగా అన్ని దేశాలకు వర్తించక పోవచ్చు. కొన్నిరకాల ద్రవ్యోల్బణాలు కొన్ని దేశాలకు మాత్రమే

వర్తిస్తాయి. ఉదాహరణకు, చెల్లింపుల శేషం ప్రాతిపదికగా ఏర్పడే ద్రవ్యోల్బణాలు - ఎగుమతి విజృంభణ, దిగుమతి ధరల పెంపు మొదలైనవి- మనదేశానికి అంతగా వర్తించవు. ఈ ద్రవ్యోల్బణాలు లాటిన్, అమెరికన్ దేశాలలో హెచ్చు. అక్కడ విదేశీ వ్యాపారం, మూలధనాల వల్ల ద్రవ్యోల్బణం చాలా ఎక్కువ శాతంలో ఉంటుంది.



అభివృద్ధి చెందుతూన్న దేశాలలో ప్రణాళికాబద్ధమైన అభివృద్ధి కార్యక్రమాలకు ప్రభుత్వము, ప్రభుత్వ ఏజన్సీలు హెచ్చు స్థాయిల్లో పెట్టుబడులు పెడతాయి. బడ్జెట్ లోట్లవల్ల, బ్యాంకుల వద్దనుంచి అప్పులు తీసుకోవడం ద్వారా ఎక్కువ భాగం విత్తం సమకూర్చవలసి ఉంటుంది. ధరల పెరుగుదలను అరికట్టడానికి ఉత్పాదకత ఎక్కువగా జరగవలె. అయితే ఉత్పాదకత ఎక్కువగా జరగకపోవడంతో ధరలు అదుపులో ఉండకుండా పోతున్నాయి.

వేతనాల పెంపు ద్రవ్యోల్బణం ప్రభావం అభివృద్ధి చెందిన దేశాలలో అధికంగా ఉంటుంది. మనదేశంలో సంఘటిత శ్రామిక శక్తి తక్కువ. అదైనా పట్టణ పారిశ్రామిక ప్రదేశాలలోనే ఉంది. గ్రామీణ ప్రాంతాలలో ఉన్న శ్రామిక వర్గం అసంఘటితమైంది (unorganised). నిరుద్యోగిత దేశంలో ఎక్కువగా ఉండటంవల్ల మన శ్రామిక వర్గానికి బేరమాడే శక్తి (bargaining power) తక్కువ.అయినప్పటికీ వాస్తవిక వేతనాల (real wages) తగ్గింపుకు ప్రతిఘటన అన్నిచోట్లా ఉంది.



విక్‌సెల్ ప్రతిపాదించిన పరపతి ద్రవ్యోల్బణం ప్రభావం మన దేశంలో ఉంది. ప్రకృతి వైపరీత్యాలవల్ల పంటలు చెడిపోవడం, సరుకులు దాచిపెట్టడం, సరుకుల సప్లయ్‌లో అంతరాయాలు ఏర్పడటం మొదలైన కారణాలవల్ల వస్తువుల ధరలు పెరిగిపోతాయి. అందుకు పరపతి విస్తరణ తోడవుతుంది. ' పరపతి నిమిత్తం కుదువ పెట్టే వస్తువుల విలువ ద్రవ్యోల్బణం వల్ల హెచ్చుతుంది. కాబట్టి పరపతి పరిమాణం కూడా హెచ్చుతుంది. ఒక విధంగా పెరిగే ధరలే ద్రవ్యోల్బణ ప్రక్రియకు మార్గాన్ని సుగమం చేస్తాయని చెప్పవచ్చు.

## 2

# ప్రపంచ వ్యాప్తంగా ధరల పెరుగుదల

గత దశాబ్దం నుంచి ధరల పెరుగుదల ప్రభావానికి లోనుగా దేశం ప్రపంచంలో ఎక్కడా లేదంటే అతిశయోక్తి కాదు. దేశంలోనూ ధరలు అంతో, ఇంతో పెరుగుతూనే ఉన్నాయి. ధరల పెరుగుదల కమ్యూనిస్టు దేశాలలో కొద్దిగా ఉంటే, అభివృద్ధి చెందుతున్న దేశాలలో అధికంగా ఉంది. అభివృద్ధి చెందిన దేశాలలో కూడా ధరల పెరుగుదల శాతం చెప్పుకోదగినంతగానే ఉం. ఉదాహరణకు అమెరికా సంయుక్త రాష్ట్రాలలో ద్రవ్యోల్బణ రేటు క్రింది విధంగా ఉంది :

1960 లో — 1.5 %
1970 లో — 5.5 %
1980 లో — 12.5 %

లాటిన్ అమెరికా, పశ్చిమ యూరప్ దేశాలలో ద్రవ్యోల్బణం రేటు మూడు అంకెల్లో (triple digit) ఉంది. ఉదాహరణ బ్రెజిల్ 100 ద్రవ్యోల్బణం, లాటిన్ అమెరికాలో 110% ద్రవ్యోల్బణం, ఇజ్రాయిల్‌లో 105% ద్రవ్యోల్బణం ఉన్నట్లుగా తెలి వస్తూన్నది.

గత యాభై సంవత్సరాలనుంచీ ప్రపంచ వ్యాప్తంగా ధరలు పెరుగుతూనే ఉన్నాయి. ఈ పెరుగుదల అవిచ్ఛిన్నంగా కొనసాగుతూనే ఉంది. 1946–1979 సంవత్సరాల మధ్య అంటే 33 సంవత్సరాల కాల వ్యవధిలో – యునైటెడ్ కింగ్‌డమ్‌లో 8 శాతమూ అమెరికా సంయుక్త రాష్ట్రాలలో 4 శాతమూ, భారతదేశంలో శాతమూ సాంవత్సరిక సగటు రేటు చొప్పున ధరలు పెరిగినాయి. ఇట్లాంటి ద్రవ్యోల్బణం రేటు ప్రపంచ చరిత్రలో అంతకు ముందు ఎప్పుడూ లేదు. యునైటెడ్ కింగ్‌డమ్‌లో 1820 లో ధరల సూచీ ఎంత ఉన్నదో 1920 లో కూడా అంతే ఉంది. అమెరికా సంయు రాష్ట్రాలలో 1800 – 1940 కాలం మధ్య ధరల సూచీలో

మార్పు ఏమీ లేదు. రెండో ప్రపంచ యుద్ధం ముగిసిన తర్వాత ప్రపంచంలో పెక్కు దేశాలలో ధరలు పెరుగుతూ రాసాగినాయి. స్వేచ్ఛా ఆర్థిక వ్యవస్థలో (free economies) ఈ ధరల పెరుగుదల కొంచెం ఎక్కువగా కనబడజొచ్చింది. ఉదా: జపాన్, లాటిన్ అమెరికా దేశాలు. ఉద్యోగిత, వాస్తవిక ఉత్పత్తులపై ప్రభావాన్ని చూపుతూ విజృంభణలు, మాంద్యాలు (booms and recessions) ఏర్పడినప్పటికీ, ధరలు మాత్రం పడిపోలేదు. కొద్దో, గొప్పో స్థిరంగానే పెరుగుతూనే వచ్చినాయి. ముఖ్యంగా రెండో ప్రపంచ యుద్ధం తర్వాత ధరల పెరుగుదల పరిణామం అత్యధికంగా కనబడ సాగింది.

రెండో ప్రపంచ యుద్ధం తర్వాత ప్రపంచవ్యాప్తంగా ధరలు క్రమంగా పెరగడానికి ఎన్నో కారణాలను చెప్పుకోవచ్చు. కీన్స్ ప్రభావానికి లోనైన అర్థశాస్త్రజ్ఞులందరూ (హాట్రే, వకీల్ తప్ప) యుద్ధపు ఖర్చు'ను హఠాత్తుగా ఆపివేయడంతో పెట్టుబడులు మందగించాయనీ, వినియోగ డిమాండ్‌లో తగ్గుదల ఏర్పడిందనీ, ఉద్యోగిత, ఉత్పత్తులు వెనుకంజ వేశాయని సిద్ధాంతీకరించారు. ద్రవ్యపు సప్లయ్ పెరుగుదల రేటుకూడా హఠాత్తుగా పడిపోవడంతో ద్రవ్యపు డిమాండ్ (monetary demand) కూడా తగ్గిందని అభిప్రాయపడినారు. బ్రెటన్ ఉడ్స్ కాన్ఫరెన్స్ (Bretton Woods Conference) సమయంలో ఆర్. జి. హాట్రే (R.G. Hawtrey) మాత్రం యుద్ధానంతర సమస్య ప్రధానంగా ద్రవ్యోల్బణమేగానీ ప్రతిద్రవ్యోల్బణం (deflation) కాదని స్పష్టంగా తెలియపర్చినాడు. మనదేశంలో 1945 తర్వాత ప్రతి ద్రవ్యోల్బణ ప్రవృత్తులు (deflationary tendencies) నెలకొంటాయని కేంద్ర ప్రభుత్వపు ఫైనాన్స్ శాఖ అభిప్రాయాన్ని ఆచార్య సి. యన్. వకీల్ తీవ్రంగా వ్యతిరేకించినాడు. రెండో ప్రపంచ యుద్ధానంతరం హెచ్చు ద్రవ్యోల్బణ ఒత్తిడులు దేశంలో ప్రబలుతాయని ఆయన నొక్కివక్కాణించినాడు.*

రెండో ప్రపంచ యుద్ధం తర్వాత ప్రపంచంలోని పెక్కు ప్రభుత్వాలు యుద్ధానికి వినియోగించిన వనరులను శాంతియుత

* C. N. Vakil : War Against Inflation

ప్రయోజనాలకు వినియోగించడానికి పూనుకున్నాయి. అందుచేత ఉత్పత్తి ప్రధానమైన కార్యాలకు పెట్టుబడులను మరలించినాయి. పాశ్చాత్య యూరప్, జపాన్ వంటి దేశాలకు సహాయం చేసేందుకు, మూలధన సామగ్రిని ఎగుమతి చేసేందుకు అమెరికా తన బడ్జెట్‌ను రూపొందించుకుంది. రెండో ప్రపంచ యుద్ధం పిమ్మట వాస్తవిక వనరులలో (real resources) లోట్లు ఏర్పడినాయి. వాస్తవిక మూలధనం స్టాక్ (real capital stock) లో కూడా కొరత ఏర్పడింది. కీన్స్ వాదానికి లోనైన ప్రభుత్వాలు సంపూర్ణోద్యోగితను(Full Employment) ద్రవ్య విధానపు ముఖ్యోద్దేశంగా భావించడం జరిగింది. యునైటెడ్ కింగ్‌డమ్‌లో హెచ్చు బడ్జెట్ కేటాయింపులు, లోట్ల వల్లనూ, వడ్డీరేట్ల తగ్గుదలవల్ల ద్రవ్యోల్బణ పరిస్థితులు హెచ్చసాగినాయి.

ప్రపంచంలోని వివిధ దేశాలు రెండో ప్రపంచ యుద్ధ ఫలితాల నుంచి తమ ఆర్థిక వ్యవస్థలను క్రమేణా మెరుగు పర్చుకో సాగినాయి. కొన్ని దేశాలలో పూర్ణోద్యోగిత లక్ష్యం సాధించడమైంది. అయినప్పటికీ ధరలు పెరుగుతూనే వచ్చాయి. తమ లక్ష్య సాధనలో ధరల పెరుగుదల అంతర్లీనమైపోయింది. శ్రామిక శక్తికీ, ఉద్యోగిత రేటుకూ గల సంబంధ బాంధవ్యాలవల్ల వినియోగిత శక్తి (utilisation capacity) పెరిగింది. తత్ఫలితంగా జాతీయాదాయానికి సంబంధించి పొదుపు పెట్టుబడుల నిష్పత్తి హెచ్చింది. వాస్తవిక ఉత్పత్తిలో పెరుగుదల రేటుకూడా చెప్పుకోదగినంతగా అభివృద్ధి చెందింది. ఈ పరిణామాల వల్ల ధరల ద్రవ్యోల్బణంలో (price-inflation) కొంత పెరుగుదల అనివార్యమైందని చెప్పవచ్చు.

అంతర్జాతీయ ద్రవత్వ రిజర్వుల (International liquid reserves) పంపిణీలో నిర్మాణాత్మక మార్పులు వచ్చినప్పటికీ ద్రవ్యోల్బణ పరిస్థితి కొనసాగుతూనే వచ్చింది. అభివృద్ధి చెందిన దేశాల యొక్క అంతర్జాతీయ ద్రవత్వ రిజర్వులు (మార్కెట్ ధరతో బంగారపు విలువల ప్రకారం) 1972 లో 80 శాతం ఉండగా, అది 1979 నాటికి 62 శాతానికి పడిపోవడం జరిగింది. అయితే పెట్రోల్‌ను ఎగుమతి చేసే దేశాల అంతర్జాతీయ ద్రవత్వ రిజర్వులు 7 శాతం నుంచి 28 శాతం వరకూ 1972–1979 సంవత్సరాల మధ్య పెరగడం

జరిగింది. దీర్ఘకాలిక ద్రవ్యోల్బణ స్థితికి వాస్తవిక ఉత్పత్తిలో సంభవించిన ధనాత్మక, ఋణాత్మక పెరుగుదల రేట్లుకూడా దోహదం చేసినాయి. అదేవిధంగా హెచ్చు, పెరుగుతూన్న ఉద్యోగితా, నిరుద్యోగితా రేట్లుకూడా కారణభూతమైనాయి. 1970–80 సంవత్సరాల మధ్య అభివృద్ధి చెందిన దేశాలమధ్య వాస్తవిక ఉత్పత్తి పెరుగుదలరేటు 3 శాతానికి తక్కువగా ఉంది. అయితే సాంవత్సరిక ద్రవ్యోల్బణపు రేటుమాత్రం ఆ యా దేశాలలో శ్రామిక శక్తికి నిరుద్యోగితా నిష్పత్తి 5 శాతానికి పైగానే 1980 లో ఉంది. తక్కువగా అభివృద్ధి చెందిన దేశాలలో, ముఖ్యంగా లాటిన్ అమెరికన్ దేశాలలో పెరుగుదల రేట్లు నిలకడగా ఉన్నప్పటికీ సాంవత్సరిక ద్రవ్యోల్బణపు రేట్లు అత్యంత అధికంగా ఉన్నాయి.

ఆర్థికంగా ఎంత బలంగాఉన్న దేశమైనప్పటికీ, ధరల ధోరణులను వెనుకకు మరల్చిన దేశం ప్రపంచంలో మచ్చుకైనా లేదని చెప్పవచ్చు. కమ్యూనిస్టు, సోషలిస్టు దేశాలలో ఎక్కువభాగం నిత్యావసర వస్తువుల రేషనింగ్ పద్ధతి అమలులో ఉంది. వస్తువుల సప్లయ్ కొరతగా ఉంటే, నల్లబజార్లు నిలువుగా పెరుగుతాయి. ధరలు వాటంతట అవే పెరుగుతాయి. వస్తువుల సప్లయ్ క్రమబద్ధంగా లేనప్పుడు వస్తువుల ఆవశ్యకతను బట్టి బ్లాక్ మార్కెట్‌లో ప్రజలు కొనుక్కోక తప్పదు. ఈ విధంగా పెరుగుతూన్న ధరలను అరికట్టడానికి కొన్ని కమ్యూనిస్టు, సోషలిస్టు దేశాలు ప్రత్యామ్నాయ మార్గాన్ని అవలంబించడం జరుగుతూన్నది. ప్రామాణిక వస్తువుల సప్లయ్‌లో కొరతలు ఏర్పడినప్పుడు, హెచ్చు నాణ్యత గల వస్తువులను ప్రజలు బలవంతంగా కొనేటట్లు చేయడం. అందువల్ల వినియోగదారు మిగులులో (consumer surplus) కొంత నష్టం ఏర్పడుతుంది. అయినప్పటికీ వేరేమార్గంలేక ప్రజలు ఎక్కువ ధనాన్ని వినియోగించి వస్తువులను కొనవల్సి ఉంటుంది.*

వివిధ దేశాలలో ధరల పెరుగుదల అవిచ్ఛిన్న పరిణామానికి స్థూలంగా కింది కారణాలను పేర్కొవచ్చు.

1. చెల్లింపుల శేషం సంక్షోభం (balance of payments crisis)

---

* R. Portes - Inflation under Central Planning

2. నిత్యావసర వస్తువుల పంపిణీ వ్యవస్థలో లోపాలు
3. పెట్రోల్, పెట్రోలియం వస్తువుల ధరల పెరుగుదల
4. విదేశీ మారకపు నిల్వల నియంత్రణ
5. సామాజిక వర్గ సంఘర్షణలు (social class conflicts)
6. సమానాంతర ద్రవ్య మార్కెట్లు (Parallel money markets) అభివృద్ధి
7. పన్నుల ఎగవేత (tax-evasion) విస్తరణ
8. అసమతౌల్య ధోరణుల పెరుగుదల
9. నిరుద్యోగిత పెంపుదల
10. వనరుల వినియోగాన్ని పూర్తిగా ఉపయోగించుకోక పోవడం.
11. వస్తువుల డిమాండ్, సప్లయ్‌ల మధ్య అగాధం.
12. అంతర్జాతీయ రాజకీయ పరిస్థితులలో అస్థిరత్వం.

వాస్తవంగా అంతర్జాతీయ ద్రవ్యోల్బణ పరిస్థితి ప్రభావం అన్ని దేశాలపైనా అంతో ఇంతో ఉంటుంది. ఈ ప్రభావానికి అభివృద్ధి చెందిన దేశాలకంటె అభివృద్ధి చెందుతూన్న, అభివృద్ధి చెందని దేశాలు ఎక్కువగా లోనవుతున్నాయి.

అంతర్జాతీయ ద్రవ్యనిధి (International Monetary Fund) వారి నివేదిక ప్రకారం భారతదేశంలో ద్రవ్యోల్బణ రేటు శాతం తక్కువ. మిగతా దేశాలలో ఈ రేటు శాతం ఎక్కువ.

**శాతాలలో సాంవత్సరిక ద్రవ్యోల్బణపు రేటు**
(Annual Rate of Inflation in Percentages)

| | ఏప్రిల్, 1974 |
|---|---|
| ప్రపంచము | 14.6 |
| అభివృద్ధి చెందిన దేశాలు | 12.3 |
| అభివృద్ధి చెందుతూన్న దేశాలు | 29.4 |
| అమెరికా | 10.1 |
| యునైటెడ్ కింగ్‌డమ్ | 15.2 |
| బ్రెజిల్ | 25.2 |

| | |
|---|---|
| చిలీ | 747.0 |
| ఇజ్రాయిల్ | 36.6 |
| భారతదేశం | 30.1 |

ఏప్రిల్, 1975 నాటికి భారతదేశంలో సాంవత్సరిక ద్రవ్యోల్బణ రేటు 30.1 నుంచి 6.5 శాతానికి పడిపోయింది. ఇంత పెద్ద ఎత్తున మరే దేశంలో ద్రవ్యోల్బణ రేటు పడిపోలేదు. అయితే 1981 లో అమలులో ఉన్న ద్రవ్యోల్బణ రేటును పరిశీలిస్తే అన్ని దేశాల ఒరవడిలోనే భారతదేశం ఉన్నదని చెప్పవచ్చు.

కమ్యూనిస్టు దేశాలలోనిత్యావసర వస్తువుల ధరలుతక్కువగా ఉండటం, విలాస వస్తువుల ధరలు ఎక్కువగా ఉండటం గమనించవచ్చు. ప్రపంచంలోని ముఖ్యమైన రెండు దేశాలకు సంబంధించిన రెండు మహానగరాలలో ఉన్న కొన్ని వస్తువుల ధరలను కింద పేర్కొనడం జరిగింది.

| | న్యూయార్క్ | | మాస్కో | |
|---|---|---|---|---|
| వారానికి పనిచేసే గంటలు | | 39.7 | | 42 |
| వారానికి కార్మికుల పొదుపులు | డాలర్లు | 265.60 | డాలర్లు | 56.54 |
| నెల అద్దె(మూడుగదుల ఇల్లు) | ,, | 1,000 | ,, | 37 |
| కారు | ,, | 6,200 | ,, | 10,000 |
| గ్యాలన్ పెట్రోల్ | ,, | 1.35 | ,, | 125 |
| వోడ్కా (లీటర్) | ,, | 6 | ,, | 11 |
| బాల్‌పాయింట్ పెన్ | సెంట్లు | 29 | సెంట్లు | 1.5 |
| సిగిరెట్ల ప్యాకెట్ | ,, | 75 | ,, | 52 |
| బ్రెడ్ (1పౌను) | ,, | 62 | ,, | 24 |
| జీన్స్ | డాలర్లు | 18.50 | డాలర్లు | 45 |
| సోఫాసెట్ | ,, | 600 | ,, | 260 |
| పెళ్ళి ఉంగరం (బంగారపుది) | ,, | 75 | ,, | 225 |
| బౌండుచేసిన నవల | ,, | 12.75 | ,, | 3 |
| కలర్ టెలివిజన్ | ,, | 710 | ,, | 1,094 |
| వార్తాపత్రిక | సెంట్లు | 25 | సెంట్లు | 5 |

మూలం : టైమ్ 23.6.80

సుప్రసిద్ధ ఆధునిక అర్థశాస్త్రజ్ఞుడు జె. కె. గాల్ బ్రెయిత్ అభిప్రాయం ప్రకారం – మానవుని చరిత్ర తిరగవేస్తే – యుద్ధం, దేశ సంక్షోభం, క్షామం, ఇతరత్రా ప్రకృతి భీభత్సాల ఫలితమే ద్రవ్యోల్బణము.* ఈ మధ్యకాలంలో ప్రపంచ వ్యాప్తంగా ద్రవ్యోల్బణం కొత్త అలవాట్లకు, ప్రవృత్తులకు లోనైనట్లు కనబడుతూన్నది. దేశంలో శాంతి నెలకొన్నప్పుడూ, దేశం ప్రగతి పథంలో పయనిస్తున్నప్పుడూ, అన్ని రంగాలలో అభివృద్ధిని సాధిస్తున్నప్పుడూ ధరలు పెరుగుతూ ఉండటం చెప్పుకోదగిన నూతన పరిణామము. ఆర్థికంగా బాగా అభివృద్ధి చెందిన దేశాలు (అమెరికా, యునైటెడ్ కింగ్‌డమ్), అభివృద్ధి చెందుతూన్న దేశాలు (జపాన్, భారతదేశం), వెనకబడివున్న దేశాలు (శ్రీలంక, బ్రెజిల్, ఇజ్రాయిల్) ధరల పెరుగుదల ప్రభావంనుంచి తప్పించుకోలేక పోతున్నాయి. సప్లయ్‌ను త్వరితంగా పెంచలేని పరిస్థితులలో, డిమాండ్‌లో కొత్తగా ఏర్పడే పెరుగుదల ధరలు ఎక్కువ కావటానికి కారణభూతమవుతుందని చెప్పవచ్చు. రెండో ప్రపంచ యుద్ధం ముగిసిన దశాబ్దాలలో అమెరికాలో పారిశ్రామిక వస్తువుల(industrial products) ధరలు స్థిరంగా పెరగసాగినాయి. ఇనుము – ఉక్కు, తత్సంబంధమైన వస్తువులు, యంత్రాలు, యంత్ర పరికరాలు, క్షేత్రసామగ్రి (farm equipment), అలోహ వస్తువుల ధరలు ఎక్కువగా పెరగ సాగినాయి. కొన్ని దేశాలలో వ్యావసాయిక వస్తువుల ధరలుకూడా పెరిగినాయి. వ్యావసాయిక వస్తువులను ఉత్పత్తిచేసే వారు అధిక సంఖ్యలో ఉండటంవల్ల, శుద్ధమైన పోటీ (Pure competition) పరిస్థితులలో, ఏ ఉత్పత్తిదారుకూ ధరలను ప్రభావితంచేసే శక్తి ఉండదని చెప్పవచ్చు. వ్యావసాయిక వస్తువుల ధరలు డిమాండ్ పెరుగుదల ననుసరించి, పెరుగుతూనే ఉంటాయనేది నిర్వివాదాంశము. పారిశ్రామిక మార్కెట్‌లో – ముఖ్యంగా ఇనుము – ఉక్కు, ఆయిల్, కార్లు, రసాయనాలు, అలోహాలను ఉత్పత్తి చేసే సంస్థలు తక్కువగా ఉండి గుత్తాధిపత్యాన్ని చేపట్టి, తమకు అనుకూలంగా ధరలను పెంచడం జరుగుతూన్నది. ఆర్థిక వ్యవస్థలో ప్రధాన రంగాలైన వ్యవసాయము, పరిశ్రమల ఉత్పత్తుల దృష్ట్యా

---

* J. K. Galbraith – The Affluent Society

ధరల పెరుగుదల కారణాలను పరిశీలించవలసి ఉంది. డిమాండ్ పెరుగుదలకు సప్లయ్ తట్టుకోలేకపోతే ధరలు వాటంతట అవే పెరుగుతాయనేది ప్రపంచంలో ప్రతి దేశానికీ వర్తించే సూత్రము. డిమాండ్‌లో తగ్గుదల ఏర్పడి సప్లయ్‌లో పెరుగుదల గోచరిస్తే ధరలు వాటంతట అవే తగ్గుతాయని ప్రత్యేకంగా చెప్పనక్కర్లేదు.

ఉత్పత్తికి అవసరమైన వస్తువు నిల్వల పెరుగుదల రేటుకూ (rate of growth of stocks of commodities), ద్రవ్యం సప్లయ్‌లో పెరుగుదల రేటుకూ గల అసమతౌల్యం వల్ల ద్రవ్యోల్బణం ఏర్పడుతుందనే వాదం ఉంది. ధర పెరుగుదలలో ద్రవ్యానికీ, వస్తువులకూ సమాన ప్రాముఖ్యమున్నది. రెండింటి పాత్రా గమనించదగింది. ద్రవ్యం సప్లయ్, పెరుగుదలను నిర్ణయించే శక్తులకూ, వాస్తవిక మూలధనం నిల్వ, దాని పెరుగుదల కారకాలకు పొత్తు కుదరనప్పుడు ద్రవ్యోల్బణం ఏర్పడుతుంది. ఏ ఆర్థిక వ్యవస్థలోనైనా ద్రవ్యం సప్లయ్‌కూ, వాస్తవిక మూలధనం నిల్వకూ సంబంధం లేకపోతే ధరలస్థాయి ఉండవల్సిన దానికంటె అధికంగా ఉంటుంది.

ప్రపంచంలోని అభివృద్ధి చెందిన, అభివృద్ధి చెందుతూన్న కొన్ని దేశాల ద్రవ్యం, స్థూల దేశీయ ఉత్పత్తి (Gross Domestic Product), ద్రవ్యోల్బణ పెరుగుదల సాంవత్సరిక రేట్లను కింద ఇవ్వడం జరిగింది.

## అభివృద్ధి చెందిన దేశాలు (Developed countries)

| దేశము | కాలవ్యవధి | ద్రవ్యంలో పెరుగుదల రేటు | స్థూల దేశీయ ఉత్పత్తిలో పెరుగుదల రేటు | ద్రవ్యోల్బణపు పెరుగుదల రేటు |
|---|---|---|---|---|
| అమెరికా | 1951–78 | 7.1 | 3.9 | 3.9 |
| యు.కె. | 1951–78 | 5.9 | 2.7 | 3.6 |
| కెనడా | 1949–78 | 7.1 | 4.9 | 4.2 |
| జపాన్ | 1959–78 | 16.4 | 8.4 | 6.7 |
| బెల్జియమ్ | 1953–78 | 5.9 | 3.8 | 3.9 |
| ఫ్రాన్స్ | 1950–78 | 10.4 | 4.8 | 6.1 |
| జర్మనీ | 1953–78 | 9.1 | 4.6 | 4.1 |
| ఇటలీ | 1960–77 | 15.1 | 4.3 | 8.4 |
| నెదర్లాండ్స్ | 1960–78 | 9.3 | 4.0 | 6.3 |
| నార్వే | 1950–77 | 7.9 | 4.3 | 5.0 |
| స్వీడన్ | 1950–77 | 7.5 | 3.2 | 5.7 |
| స్విట్జర్లాండ్ | 1949–78 | 6.6 | 3.5 | 3.8 |
| ఆస్ట్రేలియా | 1949–78 | 6.3 | 4.4 | 6.3 |
| ఆస్ట్రియా | 1964–78 | 8.5 | 4.2 | 5.1 |
| దక్షిణ ఆఫ్రికా | 1949–78 | 6.6 | 4.6 | 5.2 |
| పోర్చుగల్ | 1959–77 | 10.5 | 5.3 | 5.4 |
| సగటు | | 8.7 | 4.4 | 5.2 |

పై పట్టికను పరిశీలిస్తే కింది అంశాలు అవగాహన కాగలవు

i) ద్రవ్యం పెరుగుదల రేటుకూ, స్థూలదేశీయ ఉత్పత్తి పెరుగుదల రేటుకూ అవినాభావ సంబంధం లేదు.

ii) ఇటలీ, నెదర్లాండ్స్, ఫ్రాన్స్, జపాన్, ఆస్ట్రేలియా, దక్షిణ ఆఫ్రికా, పోర్చుగల్, స్వీడన్, నార్వే దేశాలలో 5, అంతకు మించిన శాతం సాంవత్సరిక ద్రవ్యోల్బణ రేట్లు ఉన్నాయి. ఈ ద్రవ్యోల్బణం దీర్ఘకాలం నుంచి గోచరిస్తూన్నది.

iii) జపాన్‌లో స్థూలదేశీయ ఉత్పత్తి లేదా నికర జాతీయోత్పత్తి (Net National Product)తో పాటు ద్రవ్యోల్బణ రేటు కూడా హెచ్చుగా ఉంది.

iv) యునైటెడ్ కింగ్‌డమ్‌లో స్థూలదేశీయ ఉత్పత్తి రేటు చాల తక్కువ. అయితే దీర్ఘకాలిక ద్రవ్యోల్బణ ప్రభావం ఆదేశం మీద అధికంగా ఉందని చెప్పవచ్చు.

v) అన్ని దేశాలలోనూ ద్రవ్యం సప్లయ్‌లో పెరుగుదల రేటు 6 శాతంకంటె ఎక్కువగా ఉంది. యునైటెడ్ కింగ్‌డమ్, బెల్జియమ్ దేశాలలో మాత్రమే 5.9 శాతం ఉంది.

vi) 1970–78 సంవత్సరాల మధ్య ద్రవ్యోల్బణం రేటు దాదాపు అన్ని దేశాలలో హెచ్చుగా ఉంది.

అభివృద్ధి చెందుతూన్న దేశాలు (Developing countries)

| దేశము | కాలవ్యవధి | ద్రవ్యంలో పెరుగుదల రేటు | స్థూల దేశీయ ఉత్పత్తిలో పెరుగుదల రేటు | ద్రవ్యోల్బణపు పెరుగుదల రేటు |
|---|---|---|---|---|
| అర్జంటీనా | 1960–75 | 29.7 | 3.0 | 21.9 |
| బ్రెజిల్ | 1963–77 | 34.1 | 8.9 | 28.7 |
| బర్మా | 1950–77 | 8.1 | 3.8 | 3.0 |
| చిలీ | 1961–78 | 32.2 | 2.8 | 34.3 |
| కొలంబియా | 1950–77 | 26.3 | 4.9 | 34.3 |
| ఈజిప్ట్ | 1965–76 | 11.2 | 4.2 | 5.2 |
| ఇండియా | 1950–78 | 8.5 | 3.7 | 4.3 |
| ఇండోనీషియా | 1968–77 | 31.7 | 7.3 | 17.2 |
| ఇరాన్ | 1962–77 | 18.7 | 9.2 | 8.7 |
| ఇజ్రాయిల్ | 1950–78 | 17.7 | 8.1 | 14.0 |
| కొరియా | 1953–78 | 27.2 | 7.6 | 16.9 |
| మెక్సికో | 1950–77 | 12.8 | 8.6 | 5.0 |
| నేపాల్ | 1965–77 | 12.7 | 2.4 | 6.5 |
| పాకిస్తాన్ | 1961–78 | 1.23 | 4.5 | 4.4 |
| ఫిలిపైన్స్ | 1950–78 | 9.6 | 5.8 | 5.6 |
| థాయిలాండ్ | 1957–78 | 9.0 | 7.3 | 3.6 |
| టర్కీ | 1950–76 | 17.5 | 6.3 | 10.1 |
| సగటు | | 18.8 | 5.8 | 11.8 |

పై పట్టికవల్ల కింది అంశాలు అవగాహన కాగలవు .

i) అర్జంటైనా, బ్రెజిల్, చిలీ మొదలైన లాటిన్ అమెరికన్ దేశాలలో ద్రవ్యోల్బణపు రేట్లు చాల హెచ్చుగా ఉన్నాయి.

ii) ఆసియా దేశాలలో ఇజ్రాయిల్, ఇండోనేషియా, కొరియా, టర్కీ, ఇరాన్ దేశాలకు ద్రవ్యోల్బణపు రేట్లు అధికంగా ఉన్నాయి.

iii) చాల దేశాలలో స్థూల దేశీయ ఉత్పత్తి రేటులో పెరుగుదల అభివృద్ధి చెందిన దేశాలకంటె చాల తక్కువగా ఉంది.

iv) మిగతా దేశాలకంటె భారతదేశం, బర్మా, పాకిస్తాన్, థాయిలాండ్, ఈజిప్టు దేశాలలో సాంవత్సరిక ద్రవ్యోల్బణ రేట్లు తక్కువగా ఉన్నాయి.

v) వివిధ దేశాలలో హెచ్చు ద్రవ్యోల్బణపు రేట్లు ఉండటానికి కింది కారణాలను పేర్కొనవచ్చు :

ఎ) అంతర్గత రాజకీయ అల్లర్లు

బి) హెచ్చు మిలిటరీ వ్యయము

సి) వ్యావసాయిక పెరుగుదలను నిర్లక్ష్యంచేసి పారిశ్రామిక అభివృద్ధిపట్ల శ్రద్ధ చూపడం.

డి) హెచ్చు మూలధనం రావడం.

ఇ) ఆర్థిక వ్యవస్థ నిర్వహణలో లోపాలు.

వర్తమాన అంతర్జాతీయ ద్రవ్యోల్బణానికి (international inflation) ఆయిల్ ధరల పెరుగుదలే ప్రధాన కారణమని భావించడం జరుగుతూన్నది. పెట్రోల్, పెట్రోలియమ్ వస్తువుల రేట్లు పెరగడం పైనే మిగతా వస్తువుల రేట్ల పెరుగుదల ఆధారపడి ఉందనీ, కేవలం ద్రవ్యం సప్లయ్‌తోనే ద్రవ్యోల్బణం రేటు పెరగదనీ కొందరి అభిప్రాయము. ఆయిల్ ధర సూచీ సంఖ్య (index number), వినియోగదారు ధరల సూచీ సంఖ్య, ద్రవ్యం సప్లయ్ సూచీ సంఖ్య (ప్రపంచానికి సంబంధించి) కింద ఇవ్వడం జరిగింది. పై వాటన్నింటికీ ఆధార సంవత్సరం (base year) 1975 కి సూచీ సంఖ్య 100.

| సంవత్సరము | ఆయిల్ ధర | ప్రపంచపు వినియోగ ధర సూచీ (70–100) | ప్రపంచపు ద్రవ్యం సూచీ (70–100) |
|---|---|---|---|
| 1970 | 12.1 | 54.9 | 62.2 |
| 1971 | 15.4 | 61.4 | 65.9 |
| 1972 | 17.7 | 69.7 | 69.7 |
| 1973 | 25.2 | 79.4 | 76.4 |
| 1974 | 91.0 | 88.6 | 88.1 |
| 1975 | 100.0 | 100.0 | 100.0 |
| 1976 | 106.2 | 115.0 | 111.0 |
| 1977 | 110.7 | 130.2 | 123.5 |
| 1978 | 118.3 | 148.4 | 135.4 |

పై పట్టికను విశ్లేషిస్తే, ఆయిల్ ధరకూ, వినియోగదారు ధర సూచీ సంఖ్యకూ మధ్య సహ సంబంధ గుణకము (**correlation coefficient**) 0.937. ఆయిల్ ధరలో 10శాతం పెరుగుదల వినియోగదారు ధరలో 2.7 శాతం మాత్రమే పెరుగుదలకు దారి తీస్తుంది. అయితే ద్రవ్యానికీ, ఆయిల్ ధరకూ మధ్యగల సహ సంబంధ గుణకము 0.994. ప్రపంచ ద్రవ్యం సప్లయ్‌లో 10 శాతం పెరుగుదల ఆయిల్ ధరలో 8.3 శాతం పెరుగుదలకు దారి తీయ గలదు. దీనిని బట్టి ఆయిల్ ధర పెరగడం వల్లనే అంతర్జాతీయ ద్రవ్యోల్బణం ఏర్పడుతుందని భావించడం అంత సబబు కాదు. హెచ్చు ద్రవ్యం సప్లయ్ కూడా అంతర్జాతీయ ద్రవ్యోల్బణానికి కారణభూతమని గ్రహించవలసి ఉంటుంది.

ప్రపంచ ద్రవ్యోల్బణం (**world inflation**) ప్రభావం అన్ని దేశాలపైన ఒకే విధంగా లేదు. రెండో ప్రపంచ యుద్ధం తర్వాత ప్రపంచంలోని అన్ని దేశాలలోనూ ద్రవ్యోల్బణం రేటు పెరుగుదల ప్రారంభమైంది. రెండో ప్రపంచ యుద్ధం తర్వాత, ముఖ్యంగా 1950 తర్వాత ప్రపంచ ఆర్థిక వ్యవస్థ పెరుగుదల ఎట్లా ఉందో గమనిస్తే, ద్రవ్యోల్బణం ప్రవర్తన బోధపడగలదు. కింది పట్టికలో ముఖ్యాంశాల పెరుగుదల తీరుతెన్నులను ఇవ్వడం జరిగింది.

| | ముఖ్యాంశాలు | 1950–60 | 1960–70 | 1970–78 | 1950–78 |
|---|---|---|---|---|---|
| 1. | వాస్తవిక స్థూల దేశీయ ఉత్పత్తి సూచీ | 4.2 | 5.5 | 4.0 | 4.76 |
| 2. | ప్రాథమిక వస్తువుల సప్లయ్ (basic goods supply) సూచీ | 5.1 | 4.1 | 2.7 | 4.65 |
| 3. | వర్తకపు రాశి సూచీ | 7.0 | 7.9 | 6.0 | 5.65 |
| 4. | ప్రపంచ విదేశీ మారకపు సూచీ | 3.4 | 9.3 | 21.0 | 10.64 |
| 5. | ప్రపంచపు ద్రవత్వ రిజర్వులు | 2.3 | 4.7 | 23.8 | 8.55 |
| 6. | ప్రపంచపు ద్రవ్యము | 6.5 | 7.4 | 13.0 | 8.36 |
| 7. | వినియోగదారు ధరల ప్రపంచపు సూచీ | 3.7 | 4.2 | 10.2 | 5.55 |
| 8. | వర్తకపు సరుకుల ధరల స్థాయి సూచీ | 0.4 | 1.5 | 11.0 | 4.10 |
| 9. | బంగారం ధర | 0.3 | 0.5 | 25.1 | 6.69 |
| 10. | ప్రాథమిక వస్తువుల ధరల సూచీ | -0.8 | 1.1 | 11.0 | — |

పైన ఇచ్చిన పట్టికను పరిశీలిస్తే రెండో ప్రపంచ యుద్ధం తర్వాత ప్రపంచ ఆర్థిక వ్యవస్థ 4.8 శాతం పెరుగుదలను సాధించిందని చెప్పవచ్చు. పారిశ్రామిక దేశాలైన పాశ్చాత్య ఐరోపా, జపాన్, అమెరికా, కెనడా, ఆస్ట్రేలియా, న్యూజిలాండ్‌లు 1950–60 సంవత్సరాల మధ్య 4.7 శాతం, 1960–70 సంవత్సరాల మధ్య 5.1 శాతం పెరుగుదల రేటును సాధించినాయి. అయితే వీటి పెరుగుదల రేటు 1970 – 80 సంవత్సరాల మధ్య 2.8 శాతానికి పడిపోయింది. అభివృద్ధి చెందుతూన్న దేశాలు మాత్రం రెండో ప్రపంచ యుద్ధం తర్వాత 5.0 శాతం పెరుగుద రేటును సాధించినాయి.

**అంతర్జాతీయ వర్తకంలో ప్రాథమిక వస్తువుల ధరల ధోరణులు**

అంతర్జాతీయంగా వర్తకంలో ప్రవేశించే వస్తువుల ధరల ప్రవర్తన ఒకే రకంగా లేదు. 1950–60 సంవత్సరాల మధ్య ఎగుమతులు, దిగుమతులు 97 శాతం మేరకు, 1960–70 సంవత్సరాల మధ్య 113 శాతం మేరకు, 1970–78 మధ్య 60 శాతం మేరకు పెరగడం జరిగింది. వర్తకపు వస్తువుల ధరల స్థాయి కింది విధంగా పెరిగింది :

1950 – 1960 మధ్య – 39.0 శాతం

1960 – 1970 మధ్య – 40.5 శాతం

1970 – 1980 మధ్య – 148.5 శాతం

1950–1978 సంవత్సరాల మధ్య అంతర్జాతీయ వర్తకంలో ప్రాథమిక వస్తువుల ధరల ధోరణులు ఇట్లా ఉన్నాయి

| వస్తువులు | సంవత్సరం | | | |
|---|---|---|---|---|
| | 1950 | 1960 | 1970 | 1978 |
| బియ్యం | 171.5 | 102.2 | 215.2 | 250.3 |
| జొన్నలు | — | 77.8 | 162.7 | 172.1 |
| గోధుమ | 234.6 | 105.4 | 176.4 | 217.0 |
| వేరుశనక్కాయ | 107.0 | 86.4 | 225.6 | 285.5 |
| పంచదార | 76.9 | 96.6 | 135.3 | 126.9 |
| టీ | 103.4 | 103.3 | 214.2 | 200.3 |
| ప్రత్తి | 102.5 | 78.7 | 254.7 | 195.7 |
| రబ్బరు | 71.0 | 118.8 | 163.8 | 197.4 |
| ముడి ఇనుము | — | 115.6 | 142.0 | 127.4 |
| పెట్రోలియం | 89.3 | 85.5 | 717.6 | 717.6 |
| బాక్సైట్ | 0.5 | 29.0 | 142.1 | 289.2 |
| టిన్ | 54.6 | 42.5 | 296.6 | 350.6 |

పారిశ్రామిక దేశాలు ఉత్పత్తి చేసిన వస్తువుల ధరలు, ఆయిల్ ఉత్పత్తి చేయని దేశాలు తయారుచేసే ప్రాథమిక వస్తువుల ధరలకంటె చాల హెచ్చుగా ఉన్నాయని చెప్పవచ్చు. 1962-72 సంవత్సరాల మధ్య అభివృద్ధి చెందిన దేశాలు ఉత్పత్తి చేసిన వస్తువుల ధరలు సంవత్సరానికి 4.4 శాతం చొప్పున సగటున పెరిగినాయి. ఆ తర్వాత ఈ వస్తువుల ధరలు ఊర్ధ్వముఖంగా పెరగసాగినాయి. ఈ వస్తువుల ధరల సూచీ 1960 లో 100, 1972 లో 154 ఉండగా 1980 నాటికి 488 కి హెచ్చింది. అయితే ఆయిల్ ఉత్పత్తి చేయని దేశాలు (non - oil producing countries) తయారు చేసే ప్రాథమిక వస్తువుల ధరలు అదే రేటులో పెరగలేదు.

రెండో ప్రపంచయుద్ధం తర్వాత ధరల పెరుగుదల అనేది దీర్ఘకాలిక వేగత్వరణ వ్యాధిగా పరిణమించింది. పారిశ్రామిక వస్తువుల ధరలు ఎక్కువగా, వేగంగా పెరగసాగినాయి. వ్యావసాయిక వస్తువుల ధరలు అంతవేగంగా, హెచ్చుగా పెరగడం లేదని చెప్పవచ్చు.

# 3

# భారతదేశంలో ధరల పెరుగుదల తీరుతెన్నులు

ధరల పెరుగుదల ప్రభావానికి లోనుగాని దేశం ప్రపంచంలో బహు అరుదు. అదేవిధంగా మన దేశం కూడా ధరల పెరుగుదల ప్రభావానికి గురైందని చెప్పడంలో అతిశయోక్తి ఏమీ లేదు. ధరల పెరుగుదలవల్ల ప్రపంచంలో పెక్కు దేశాల ఆర్థిక వ్యవస్థలు, ప్రజలు ఏ విధంగా ఇబ్బందులకు గురికావడం జరిగిందో మన దేశ ఆర్థిక వ్యవస్థ, మన దేశ ప్రజలు అనేక ఇబ్బందులకు గురి కావడం జరిగిందని ప్రత్యేకంగా చెప్పనక్కర్లేదు.

రెండో ప్రపంచ యుద్ధకాలం నుంచీ ధరలు పెరగసాగినాయి. రెండో ప్రపంచ యుద్ధం పర్యవసానంగా ఆహారధాన్యాలలో ఏర్పడిన విపరీతమైన కొరత వల్ల ధరలు పెరగడం మొదలెట్టినాయి. 1939–1952 మధ్య సాధారణ ధరల సూచీసంఖ్య 100 నుంచి 380.5 వరకు, పారిశ్రామిక వస్తువుల సూచీసంఖ్య 371.3 వరకు పెరగగా, ఆహార ధాన్యాల సూచీ సంఖ్య 445.5 వరకు పెరిగింది. దీనిని బట్టి మన దేశంలో పంచవర్ష ప్రణాళికలు ప్రారంభమయ్యే సమయానికే సాధారణ ధరలు $3\frac{1}{2}$ రెట్లకు పైగాను, ఆహార ధాన్యాల ధరలు $4\frac{1}{2}$ రెట్ల వరకు పెరిగాయని చెప్పవచ్చు. మన దేశంలో ఆర్థిక ప్రణాళికలు మొదలైనప్పటి నుంచి అన్నిరకాల వస్తువుల ధరలు ఇంతో అంతో పెరుగుతూనే వచ్చినాయి. ప్రస్తుతంకూడా ధరలు పెరుగుతూనే ఉన్నాయి.

ద్రవ్యోల్బణం అనేది ఒక సాధనము. ఆ సాధనం ద్వారా మన దేశ ఆర్థిక వ్యవస్థలోని ధనవంతులు అసంఘటిత రంగానికి (un-organised sector) చెందిన బీదవారి నుంచి ఆర్థిక వనరులను తమకు అనుకూలంగా భారీ ఎత్తున మళ్ళించుకొన్నారని నరోత్తమ్‌షా వ్యాఖ్యానించడం జరిగింది.* ఆ వ్యాఖ్యానంలో వాస్తవం లేకపోలేదు.

---

* Illustrated weekly, 6 . 7 . 1980

వ్యావసాయిక ప్రధానమైన మనదేశంలో కర్షకులు, వ్యవసాయ కూలీలు ఎన్ని ప్రణాళికలు అమలు జరిగినా, ఎన్ని దశాబ్దాల కాలం గడిచినా తమ ఆర్థికతను మెరుగు పర్చుకోలేక పోవడం గమనించ వలసిన సత్యము. మన ఆర్థిక వ్యవస్థలో ధనవంతుడు మరీ ధనవంతు డవుతున్నాడు. బీదవాడు మరీ బీదవాడవుతున్నాడు. మధ్య తరగతి ప్రజల సంగతి చెప్పనక్కర్లేదు. ధరలు స్థిరంగా అధోముఖంగా పెరుగుతూన్న స్థితిలో మధ్య తరగతి ప్రజలు భూమ్యాకాశాల మధ్య వ్రేళ్ళాడవలసి వస్తూన్నదని వేరే చెప్పనక్కర్లేదు.

ఒక వస్తువు ధర సప్లయ్ డిమాండ్ పరిస్థితులను బట్టి నిర్ణయ మవుతుందనే విషయం మాందరికీ తెలుసు. ఆర్థిక వ్యవస్థలో ఒక వస్తువుకు వర్తించే సప్లయ్-డిమాండ్ సూత్రం అన్ని వస్తువులకూ, సేవలకూ వర్తిస్తుంది. సమష్టి సప్లయ్‌ని (aggregate supply) సమష్టి డిమాండ్ (aggregate demand) అధిగమించినప్పుడు ధరలు పెరగడం మొదలు పెడతాయి. ఆ సప్లయ్, డిమాండ్‌కు సమానమయ్యే వరకూ ధరలు పెరుగుతూనే ఉంటాయి. ద్రవ్యోల్బణ ప్రక్రియ తాలూకు యంత్రాంగమిదే.

మార్కెట్‌లో రకరకాల వస్తువులు ఉంటాయి. ఆ వస్తువుల సమష్టి సప్లయ్, డిమాండ్‌లు రకరకాలుగా ఉంటాయి. కాబట్టి వస్తువుల ధరలన్నీ ఏకరూపతగా (uniform) మారతాయని చెప్ప డానికి వీలులేదు. సమష్టి సప్లయ్, డిమాండ్‌లో ఏర్పడే వ్యత్యాసాల పరిమాణాన్ని బట్టి ధరలు పెరుగుతూ ఉంటాయి. ఉదాహరణకు, పంచదారకు సమష్టి సప్లయ్ స్వల్పంగా ఉందనుకోండి. దాని సమిష్టి డిమాండ్ చాల హెచ్చుగా ఉందనుకోండి. అప్పుడు పంచదార ధర చాల ఎక్కువగా పెరగడానికి అవకాశముంది. అదే విధంగా బియ్యానికి సమిష్టి సప్లయ్, డిమాండ్ల మధ్య ఎక్కువ వ్యత్యాసం లేదనుకోండి. అప్పుడు బియ్యం ధర అంతగా పెరగదు.

**సమష్టి సప్లయ్, డిమాండ్‌ల మదింపు**

మన దేశపు ఆర్థిక వ్యవస్థను దృష్టిలో పెట్టుకొని సమష్టి

సప్లయ్‌ను వాస్తవిక జాతీయాదాయం (real national income) ద్వారానూ, సమష్టి డిమాండ్‌ను ద్రవ్యం సప్లయ్ (money supply) ద్వారానూ మదింపు చేయవచ్చు. దీని అర్థమేమిటంటే - సమష్టి సప్లయ్‌కి వాస్తవిక జాతీయాదాయాన్ని సూచీగా; సమష్టి డిమాండ్‌కు ద్రవ్యం సప్లయ్‌ని సూచీగా తీసుకోవచ్చు.

1970–80 సంవత్సరాల మధ్య మన వాస్తవిక జాతీయాదాయం సగటున 3 శాతం చొప్పున పెరుగుతూ వచ్చింది. అదే కాలంలో ద్రవ్యం సప్లయ్ సంవత్సరానికి 14 శాతం చొప్పున పెరుగుతూ వచ్చింది. వాస్తవిక జాతీయాదాయం పెరుగుదలకు, ద్రవ్యం సప్లయ్ పెరుగుదలకూ మధ్యగల అగాధం వల్ల 1970 – 80 మధ్య కాలంలో వినియోగదారు ధరలు (consumer prices) సగటున సంవత్సరానికి 8 శాతం చొప్పున పెరిగినాయి. అంతే కాకుండా గత మూడు దశాబ్దాలుగా భారత దేశపు వాస్తవిక పెరుగుదల రేటు సంవత్సరానికి $3\frac{1}{2}$ శాతం వద్ద దాదాపు నిల్చి పోయింది. దీనికి భిన్నంగా ద్రవ్యం సప్లయ్ పెరుగుదల రేటు దశాబ్దానికీ, దశాబ్దానికీ హెచ్చుతూ రాసాగింది. అందువల్ల ధరలు స్థిరంగా పెరిగినాయని చెప్పవచ్చు.

గత 30 సంవత్సరాలలో వినియోగదారు ధరల సగటు సాంవత్సరిక పెరుగుదల రేటు ఇట్లా ఉంది :

| సంవత్సరము | రేటు–శాతం |
|---|---|
| 1950–51 నుంచి 1960–61 | 2.0 |
| 1960–61 నుంచి 1970–71 | 3.3 |
| 1970–71 నుంచి 1979–80 | 8.1 |

### మన దేశంలో ద్రవ్యం పద్ధతి

ప్రస్తుతం మన దేశంలో అమలులో ఉన్న ద్రవ్యం పద్ధతిని రిజర్వ్ బ్యాంక్ ఆఫ్ ఇండియా నిర్వహిస్తున్నది. ఈ పద్ధతికి

మార్పిడికి వీలుగాని కాగితం కరెన్సీ (inconvertible paper currency) మూలాధారము. మార్పిడికి వీలుగాని కాగితం కరెన్సీ అంటే బంగారంలోకి గానీ, వెండిలోకి గానీ మార్పిడి చేయడానికి వీలుగాని కరెన్సీనోట్లు. దేశీయ ప్రయోజనాల నిమిత్తం రూపాయి నాణేలు, కరెన్సీనోట్లు ఉన్నాయి. విదేశీయ ప్రయోజనాల నిమిత్తం రూపాయిని ప్రపంచదేశాల కరెన్సీలలోకి మార్పిడి చేయవచ్చు.

రూపాయి మనదేశం యొక్క ద్రవ్య యూనిట్ (monetary unit). అది దశాంశ పద్ధతి (decimal system) మీద ఆధారపడి ఉంది. రూపాయికి వంద పైసలు. రూపాయి నాణేలు, అర్ధరూపాయి నాణేలు, పావలా నాణేలు, పది పైసల, అయిదు పైసల, మూడు పైసల, రెండు పైసల, పైసా నాణేలు ఉన్నాయి. రూపాయి నాణేన్ని ఒకప్పుడు వెండితో తయారు చేసేవారు గానీ, ఇప్పుడు నికెల్‌తోనే తయారు చేస్తున్నారు. మన దేశపు ద్రవ్య నాణేలను కృతక నాణేలు (token coins) అంటారు. ఎందుకంటే వాటి లోహపు విలువ (metallic value) కంటె ముద్రిత విలువ (face value) చాల ఎక్కువ. రెండో ప్రపంచ యుద్ధకాలంలో రూపాయి నాణేలను వెండితో తయారు చేయడానికి ప్రభుత్వం ఎన్నో ఇబ్బందులను ఎదుర్కోవలసి వచ్చింది. వెండి తగినంతగా లభ్యం కాలేదు. రూపాయి నాణేలకు బదులు ఇండియా ప్రభుత్వం రూపాయి నోట్లను జారీచేసింది. అందుచేతనే కొంతమంది రూపాయి నోటును కాగితం మీద ముద్రించిన రూపాయి నాణెం అంటారు. రూపాయి నోటు, రూపాయినాణెం, అర్ధరూపాయి నాణెం అపరిమిత చట్టబద్ధ ద్రవ్యానికి (unlimited legal tender) చెందినవి. అంటే ఎంత మొత్తం అప్పులనైనా చెల్లించడానికి వాటిని ఉపయోగించవచ్చు. చిన్న చిన్న నాణేలు పరిమిత చట్టబద్ధ ద్రవ్యానికి (limited legal tender money) చెందినవి. వాటిని పెద్ద మొత్తాల అప్పుల చెల్లింపుకు ఉపయోగించరాదు. ఉదాహరణకు, మీరు X అనే వ్యక్తికి రూ. 1,000 బాకీ ఉన్నారనుకోండి. ఆ సొమ్మును 5పైసల నాణేలలో చెల్లిస్తే X ఒప్పుకోక పోవచ్చు. రకరకాల నాణేలను తయారు చేసే మింట్లు (mints) రిజర్వుబాంకు నిర్వహణ, నిర్దేశాల

కింద పనిచేస్తాయి. 1978-79 సంవత్సరంలో చెలామణిలో ఉన్న రూపాయి, తదితర నాణేల మొత్తం విలువ రూ. 590 కోట్లు.

## కరెన్సీ నోట్లు

కరెన్సీ నోట్లను లేదా కాగితం ద్రవ్యాన్ని (paper money) రిజర్వుబాంకు ముద్రించి, జారీ చేస్తుంది. ఒక్క రూపాయి నోట్లు తప్ప మిగతా నోట్లు రెండు, అయిదు, పది, ఇరవై, యాభై, వంద రూపాయిల నోట్లను రిజర్వు బాంకే జారీచేస్తుంది. కరెన్సీనోట్ల జారీకోసం రిజర్వు బాంకులో జారీ శాఖ (Issue Department) అనే ప్రత్యేక శాఖ ఉంది. కొన్ని రిజర్వుల ఆధారంగా ఈ శాఖ కరెన్సీ నోట్లను జారీచేస్తుంది. నోట్ల జారీకి ఆలంబనగా బంగారు, వెండి రిజర్వులను గానీ, బంగారంలోకి మార్పిడి చేయడానికి వీలుగా ఉండే విదేశీ కరెన్సీలను గానీ రిజర్వు బాంకు పూర్వం ఉంచవల్సి ఉండేది. ఎవరైనా కరెన్సీ నోట్లను ఇచ్చి వాటికి బదులుగా బంగారాన్ని తీసుకోవచ్చు. కాని ఈ పద్ధతి ఇప్పుడు అమలులో లేదు. రూపాయిని బంగారంలోకి మార్చే పద్ధతి లేదు. అందుచేత రిజర్వు బాంకు నోట్ల జారీకి ఆలంబనగా నామమాత్రం గానే బంగారు రిజర్వులను ఉంచుతూన్నది. ప్రస్తుతం జారీ శాఖవద్ద రూ. 200 కోట్ల మేరకు బంగారం, విదేశీ సెక్యూరిటీలు మాత్రమే ఉన్నాయి. వాటిల్లో బంగారం విలువ రూ. 115 కోట్లు. మిగతావి కేంద్ర ప్రభుత్వపు బాండ్లు రూపాయి సెక్యూరిటీలలో. జారీశాఖకు సెక్యూరిటీలు ఉండటమనేది ఇప్పుడు లాంఛనప్రాయం మాత్రమే ఒకప్పుడు ఇంతశాతం మేరకు విదేశీ సెక్యూరిటీలు గానీ, బంగారం రిజర్వులు ఉండాలనే నియమం ఉండేది. ఇప్పుడా నియమం లేదు. జారీ శాఖకు రిజర్వులు గానీ, ఆస్తులు (assets) గానీ ఆలంబనగా (backing) ఉండాలనే దాని ముఖ్యోద్దేశం - రిజర్వు బాంకు తన ఇష్టం వచ్చిన మొత్తంలో కరెన్సీ నోట్లను అచ్చు వేయకుండా ఉండటం. ప్రస్తుతం మన దేశంలో అమలులో ఉన్న నోట్ల జారీ పద్ధతి కనీస రిజర్వు పద్ధతి (Minimum Reserve system).

మనదేశంలో కరెన్సీ నోట్ల జారీ ప్రతి సంవత్సరం పెరుగుతూనే ఉంది. కింది పట్టికను గమనించండి.

| కాల వ్యవధి | చెలామణిలో ఉన్న కరెన్సీ (రూ. కోట్లలో) |
|---|---|
| 1938–39 | 180 |
| 1950–51 | 1,240 |
| 1970–71 | 4,170 |
| 1978–79 | 10,220 |

మూలం : రిజర్వు బ్యాంక్ ఆఫ్ ఇండియా : రిపోర్ట్ ఆన్ కరెన్సీ అండ్ ఫైనాన్స్.

పైన ఇచ్చిన పట్టికనుబట్టి రెండో ప్రపంచ యుద్ధానికి ముందు చెలామణిలో ఉన్న కరెన్సీ నోట్ల విలువ రూ. 180 కోట్లు మాత్రమే. ఆ మొత్తం 1950 51 నాటికి రూ. 1,240 కోట్లు కాగా; 1978–79 నాటికి రూ. 10,220 కోట్లు అయింది.

## బ్యాంకు ద్రవ్యము (Bank money)

బాంకు ద్రవ్యాన్నే డిపాజిట్ ద్రవ్యం (deposit money) అనికూడా అంటారు. ఈ రోజుల్లో ప్రజలు తమ వద్ద మిగులుగా ఉన్న ధనాన్ని ఇళ్ళల్లో దాచుకోరు. అట్లా దాచుకొంటే ఆ డబ్బును దొంగలు అపహరించవచ్చు; అగ్ని ప్రమాదాల వల్ల నాశనం కావచ్చు. మరే కారణం చేతనైనా అదృశ్యం కావచ్చు, లేదా ఖర్చు పెట్టాలనే అభిలాష ఏర్పడవచ్చు. అందుచేతనే చాలమంది తమ దగ్గర మిగులుగా ఉన్న డబ్బును బాంకులో దాచుకుంటారు. బాంకులో డబ్బు దాచుకోవడం వల్ల భద్రతతోపాటు వడ్డీకూడా లభిస్తుంది. అంతేకాకుండా తమకు అవసరం వచ్చినప్పుడు కావలసిన

డబ్బును తీసుకోవచ్చు. ఎవరికైనా డబ్బు ఇవ్వాల్సివున్నా చెక్కుల ద్వారా, డ్రాఫ్టులద్వారా చెల్లించవచ్చు. ఇన్ని సౌకర్యాలు ఉండటం వల్ల ప్రజలు మిగులు సొమ్మును బ్యాంకుల్లో దాచుకుంటూ ఉంటారు. 1969 లో బ్యాంకుల జాతీయకరణ జరిగిన దగ్గర్నుంచీ ప్రజలలో బాంకింగ్ అలవాటు ఎక్కువైంది. అంతకుముందు బ్యాంకులు నగరాలలోనే ఉండి, ఎక్కువ భాగం భాగ్యవంతులకే ఉపయోగ పడేవి. కాని ఇప్పటి పరిస్థితి పూర్తిగా భిన్నము. బ్యాంకులు దివి నుండి భువికి దిగి వచ్చినట్లుగా పట్టణ ప్రాంతాలనుంచి పల్లె ప్రాంతాలకు వ్యాపించినాయి. కొన్ని వేల బ్యాంకు బ్రాంచీలను తెరవడం జరిగింది. పల్లె ప్రాంతాల వారు కూడా బ్యాంకింగ్ సేవలను విరివిగా వినియోగించుకుంటున్నారు. దాదాపు 94 శాతం బ్యాంకింగ్ రంగం ప్రభుత్వ అజమాయిషీ కిందనే ఉండటం వల్ల బ్యాంకులు బలహీన వర్గాల వారికి, ఆర్థికంగా వెనకబడిన వారికి, సన్నకారు రైతులకు, వృత్తి విద్యలను నమ్ముకొని జీవించే వారికి ఎన్నో విధాలుగా ఉపయోగపడుతున్నాయి.

చెక్కు అనేది వాస్తవంగా ద్రవ్యం కానప్పటికీ ద్రవ్యంతో సమానమైనది. చెక్కుల ద్వారా భారీ మొత్తాల చెల్లింపులు జరగడం ఈనాడు సర్వ సామాన్యము. ముఖ్యంగా వ్యాపారస్తులు తమ డబ్బు వ్యవహారాలను ఎక్కువ భాగం చెక్కుల ద్వారానే జరుపుతూ ఉంటారు. ముడి పదార్థాలు కొన్నా, యంత్రాలు, యంత్ర పరికరాలు కొన్నా సొమ్మును చెక్కుల ద్వారానే చెల్లిస్తారు. అదే విధంగా తయారీ వస్తువులు అమ్మినప్పుడు అమ్మకపు సొమ్మును చెక్కుల ద్వారానే స్వీకరించడం జరుగుతుంది. అంతే కాకుండా బ్యాంకు చెక్కులను, బ్యాంకు డ్రాఫ్టు ను ఒక ప్రదేశం నుంచి మరో ప్రదేశానికి డబ్బు పంపడానికి ఉపయోగిస్తారు. బ్యాంకు చెక్కులూ, డ్రాఫ్టులూ అనేవి సాధనాలే గానీ అసలు ద్రవ్యం బ్యాంకు డిపాజిట్లే. బ్యాంకు డిపాజిట్లలో అనేక రకాలున్నాయి. ఫిక్సెడ్ డిపాజిట్లు (fixed deposits), సేవింగ్ డిపాజిట్లు (saving deposits), డిమాండ్ డిపాజిట్లు (Demand deposits), రికరింగ్ డిపాజిట్లు (Recurring deposits) మొదలైనవి. కొన్ని ప్రత్యేక

ప్రయోజనాలను ఆశించి ప్రజలు ఈ డిపాజిట్ల ఖాతాలను బ్యాంకుల్లో తెరుస్తూ ఉంటారు. ఈ డిపాజిట్లలో డిమాండ్ డిపాజిట్లనే బ్యాంకు ద్రవ్యంగా పరిగణిస్తారు. 1978-79 సంవత్సరంలో బ్యాంకు డిపాజిట్లు రూ. 11,660 కోట్ల మేరకు ఉన్నాయి.

ప్రజల వద్దనున్న డిపాజిట్ ద్రవ్యం

| సంవత్సరం | (రూ. కోట్లలో) |
|---|---|
| 1970 | 2,808 |
| 1971 | 3,350 |
| 1972 | 4,052 |
| 1973 | 4,716 |
| 1974 | 5,425 |
| 1975 | 6,210 |
| 1976 | 7,887 |
| 1977 | 8,864 |
| 1978 | 11,658 |

మూలం : ఇండియా, 1979

### ప్రజల దగ్గరున్న ద్రవ్యం సప్లయ్ (Money supply with the Public)

ప్రజల దగ్గరున్న ద్రవ్యం సప్లయ్‌లో ప్రధానంగా రెండు అంశాలు ఇమిడి ఉంటాయి. i) ప్రజల దగ్గరున్న కరెన్సీ ii) బ్యాంకు డిపాజిట్లు. ప్రజల దగ్గరున్న కరెన్సీలో చెలామణిలో ఉన్న కరెన్సీ నోట్లు, రూపాయి, ఇతర చిల్లర నాణేలు ఉంటాయి. బ్యాంకు డిపాజిట్లలో మొత్తం డిమాండ్ డిపాజిట్లు ఉంటాయి.

ప్రజల దగ్గరున్న మొత్తం ద్రవ్యం సప్లయ్‌లో కింది అంశా లుంటాయి.

i) కరెన్సీ – ఎ) కరెన్సీ నోట్లు
బి) రూపాయి నాణేలు, ఇతర త్రా చిల్లర నాణేలు

ii) డిపాజిట్ ద్రవ్యం.

భారతీయ ప్రజల దగ్గరున్న మొత్తం ద్రవ్యం 1978-79 నాటికి రూ. 21,860 కోట్లు. ఈ మధ్యకాలంలో ప్రజల దగ్గరున్న ద్రవ్యం పెరుగుదలను గమనించవలసిన విశేషాంశము. కింది పట్టిక చూడండి :

| సంవత్సరం | ద్రవ్యం సప్లయ్ (రూ. కోట్లలో) | సూచీ సంఖ్య |
|---|---|---|
| 1950–51 | 1,850 | 100 |
| 1960–61 | 2,870 | 155 |
| 1970–71 | 7,140 | 386 |
| 1978–79 | 21,860 | 1,180 |

మూలం : రిజర్వ్ బ్యాంకు ఆఫ్ ఇండియా బులిటెన్లు

ప్రజల దగ్గరున్న ద్రవ్యం సప్లయ్‌లో 1960–61 వరకు కొద్ది పెరుగుదల మాత్రమే (అంటే 55 శాతం) జరిగింది. అయితే ఆ తరువాతి 10 సంవత్సరాలలో ద్రవ్యం సప్లయ్ 231 పాయింట్ల మేరకు పెరిగింది. ఆ తరువాతి 8 సంవత్సరాలలో (1971–79) ద్రవ్యం సప్లయ్ దాదాపు 800 పాయింట్ల మేరకు హెచ్చింది. ద్రవ్యం సప్లయ్‌లో పెరుగుదలకు ముఖ్యకారణాలుగా కరెన్సీ నోట్ల ముద్రణ, బ్యాంకు డిపాజిట్లలో పెరుగుదలను చెప్పవచ్చు. వ్యయానికి డబ్బు

అవసరమైనప్పుడల్లా కేంద్ర ప్రభుత్వం కరెన్సీ నోట్లను ముద్రించ సాగింది. ప్రజలకు ద్రవ్యాదాయం (money income) హెచ్చుగా ఉన్నప్పుడు, వస్తు సేవలకు గల వారి డిమాండ్ పెరగడంలో ఆశ్చర్యం లేదు. అట్లాంటి పరిస్థితులలో ధరలు పెరగడం సహజము. మన దేశంలో ధరల స్థాయి పెరగడానికి ద్రవ్యం సప్లయ్‌లో హెచ్చుదలను ఒక కారణంగా పేర్కొనవచ్చు.

ద్రవ్యం సప్లయ్ ఎట్లా పెరుగుతుంది ?

ద్రవ్యం సప్లయ్ అనేవి భగవంతుని సృష్టి కాదు; మాయ, మంత్రాలతో కూడుకొన్నది కాదు. ఒక్క రూపాయిని అదనంగా సృష్టించడం అనేది దేశపు ద్రవ్యాధికారులు తీసుకొన్న నిర్ణయాలపై ఆధారపడి ఉంటుంది. స్థూలంగా ద్రవ్య సృష్టి కింది విధంగా జరుగుతుంది :

i) బ్యాంకింగ్ రంగం ప్రభుత్వానికి అప్పు ఇచ్చినప్పుడు (దీనిని లోటుదారీ ఆర్థిక విధానం (deficit financing) అంటారు.)

ii) బ్యాంకింగ్ రంగం వ్యాపార రంగానికి అప్పు ఇచ్చినప్పుడు (వ్యాపార రంగంలో ప్రభుత్వ రంగ సంస్థలు కూడా చేరి ఉంటాయి.)

పైన పేర్కొన్న రెండింటిలో లోటుదారీ ఆర్థిక విధానం వల్ల ద్రవ్యోల్బణం హెచ్చు కానడానికి అవకాశాలు అధికంగా ఉన్నాయి.

లోటుదారీ ఆర్థిక విధానమంటే ఏమిటి ? ప్రజలనుంచి అప్పు తెచ్చిన ధనం ద్వారా ప్రభుత్వాన్ని వ్యయాన్ని ఆదుకొని, ఆ మొత్తాన్ని బడ్జెట్‌లో లోటుగా చూపెడితే దానిని స్థూలంగా లోటుదారీ ఆర్థిక విధానమంటారు. మన దేశంలో ప్రస్తుతపు రాబడిని మించిన వ్యయాన్ని, ప్రజలనుంచి అప్పు తెచ్చిన సొమ్మును

లోటుదారీ ఆర్థిక విధానంగా భావిస్తారు. ఈ అర్థంలో లోటును కింద పేర్కొన్న ఏదైనా ఒక పద్ధతి ద్వారాగానీ, మరికొన్ని పద్ధతుల ద్వారాగానీ భర్తీ చేయడం జరుగుతుంది.

i) నగదు నిల్వలను (cash balances) విత్ డ్రా చేయడం.

ii) రిజర్వు బ్యాంక్ ఆఫ్ ఇండియానుంచి అప్పుతీసుకోవడం.

iii) వాణిజ్య బ్యాంకులనుంచి అప్పు తెచ్చుకోవడం.

iv) ప్రభుత్వం కొత్తగా కరెన్సీని జారీచేయడం.

మనదేశంలో ప్రభుత్వం కొత్తగా కరెన్సీని జారీచేసే పద్ధతిని సాధారణంగా అనుసరించడం లేదు. మనదేశంలో ప్రభుత్వం రిజర్వు బ్యాంకునుంచి కొంతమేరకు నగదు నిల్వలను విత్ డ్రా (withdraw) చేస్తుంది. మరికొంత మేరకు ట్రజరీ బిల్లులను జారీ చేస్తుంది. ఆ బిల్లులను రిజర్వు బ్యాంకు, వాణిజ్య బ్యాంకులు స్వీకరిస్తాయి. రిజర్వు బ్యాంకు నుంచి అప్పు తెచ్చుకోవడమంటే వాస్తవంగా ప్రభుత్వం వద్ద అదనపు సొమ్ము ఉండటమే!

భారతదేశ ప్రభుత్వం లోటుదారీ ఆర్థిక విధానాన్ని పంచవర్ష ప్రణాళికల కోసం అవసరమైన నిధులను సమకూర్చడం నిమిత్తం ఆశ్రయించింది. పంచవర్ష ప్రణాళికలకు విత్తాన్ని సమకూర్చడంలో అదనపు పన్నులు, ప్రజలనుంచి అప్పు తెచ్చుకోవడం సరిపోదు. వనరులలో ఏర్పడిన తరుగుదలను పూడ్చుకోవడానికి విదేశీ సహాయాన్ని (external assistance) అర్థించవలసి ఉంటుంది. అదైనా పరిమిత పరిమాణంలోనే లభించగలదు. అంతే కాకుండా విదేశీ సహాయం మీద ఎక్కువగా ఆధారపడి ఉండటంవల్ల ఎన్నో చిక్కులున్నాయి. అందువల్ల లోటుదారీ ఆర్థిక విధానాన్ని ఆశ్రయించవలసిన ఆవశ్యకత ఏర్పడుతుంది. ప్రణాళికలలో ఉత్పత్తికీ, ఉపాధికల్పనకూ, పెరుగుదల రేటుకూ కొన్ని లక్ష్యాలను నిర్దేశించడమవుతుంది. వాటి సాధనకు అదనపు వనరులు అవసరమవుతాయి. ఆ వనరులలో లోటుదారీ ఆర్థిక విధానం పద్ధతి ఒకటి.

ప్రణాళికల కాలంలో లోటుదారీ ఆర్థిక విధానం ఎంత పరిమాణంలో ఉందో కింది పట్టికద్వారా గ్రహించవచ్చు :

| | రూ. కోట్లలో |
|---|---|
| మొదటి ప్రణాళిక | 420 |
| రెండో ప్రణాళిక | 950 |
| మూడో ప్రణాళిక | 1,180 |
| నాలుగో ప్రణాళిక | 2,960 |

లోటుదారీ ఆర్థిక విధానంవల్ల కొన్ని ప్రయోజనాలున్నాయి. అయితే ప్రస్తుత పరిస్థితులలో ప్రయోజనాల కంటె ప్రమాదాలే ఎక్కువగా కనబడుతున్నాయి. లోటు ఆర్థిక విధానాన్ని కడు జాగ్రత్తగా అమలులో పెడితే దేశానికి కొన్ని ప్రయోజనాలు లభిస్తాయి. దేశం ఆర్థికంగా సత్వరం అభివృద్ధి చెందడానికి లోటు దారీ ఆర్థిక విధానం పద్ధతి' దోహదం చేస్తుంది. ప్రభుత్వం లోటు దారీ ఆర్థిక విధానాన్ని ఆశ్రయిస్తే, రిజర్వు బ్యాంకునుంచి అప్పు తీసుకుంటుంది. ఆ అప్పుకుగాను ప్రభుత్వం రిజర్వు బాంకుకు చెల్లించే వడ్డీ (interest) లాభాల (profits) రూపంలో ప్రభుత్వానికే దక్కుతుంది. లోటుదారీ ఆర్థిక విధానం ద్వారా దేశంలో లభ్యమయ్యే వనరులను అతి త్వరితంగా వినియోగించుకోవచ్చు. ప్రణాళికా బద్ధమైన అభివృద్ధి కృషిలో కార్యక్రమాలను కాలానుసారంగా అమలుపర్చడం జరుగుతుంది. అభివృద్ధి వేగంగా జరుగుతుంది. అందుకు లోటుదారీ ఆర్థిక విధానపు విత్తం ఎంతో ఉపయోగపడుతుంది.

లోటుదారీ ఆర్థిక విధానంవల్ల ఎన్నో అనర్థాలు ఉన్నాయి. దీని ప్రభావం వల్ల ధరలు విపరీతంగా పెరిగే అవకాశమున్నది. లోటుదారీ ఆర్థిక విధానం వల్ల మొత్తం ప్రభుత్వ వ్యయం పెరుగుతుంది. తత్ఫలితంగా వస్తుసేవలకు సమష్టి డిమాండ్ పెరుగుతుంది. హెచ్చు వ్యయం ఎల్లప్పుడూ ధరల పెరుగుదలకు ప్రధాన కారణ

మవుతుంది. అయితే అభివృద్ధి నిమిత్తం ఉపయోగించే లోటుదారీ ఆర్థిక విధానంవల్ల ఉత్పత్తి పెరుగుతుందనీ, అందువల్ల ధరలు తటస్థంగా ఉంటాయనీ - అనే వాదం లేకపోలేదు. అయితే అభివృద్ధి ప్రణాళికలు పూర్తికావడానికీ, ఆ ప్రణాళికల వల్ల ఉత్పత్తి అధికం కావడానికీ చాలకాలం పడుతుంది. కొన్ని ప్రణాళికలు పూర్తి కావడానికి 15, 20 సంవత్సరాలు పట్టవచ్చు. ఈ లోపల ధరలు పెరగకుండా నిల్చిపోవు.

లోటుదారీ ఆర్థిక విధానం వల్ల మరో ప్రమాదముంది. వాణిజ్య బ్యాంకుల పరపతి సృష్టి (credit creation) వల్ల ద్రవ్యోల్బణ శక్తులు విశృంఖలంగా విహరిస్తాయి. వాణిజ్య బ్యాంకుల దగ్గర అదనపు నిధులు ఉంటాయి (ప్రభుత్వ వ్యయం వల్ల). అందువల్ల వ్యక్తులకూ, సంస్థలకూ అదనంగా ఋణాలు, అడ్వాన్సులు ఇచ్చే స్తోమత వాణిజ్య బ్యాంకులకు ఉంటుంది. దీని వల్ల కూడా వస్తు, సేవలకు డిమాండ్ పెరుగుతుంది. తత్ఫలితంగా ధరలలో పెరుగుదల ఏర్పడుతుంది. ధరలు పెరిగినప్పుడు జీతాలు, వేతనాలు పెరగవల్సి ఉంటుంది. ప్రభుత్వ ఖజానాపై అదనపుభారం పడుతుంది. ప్రభుత్వం మరింత లోటుదారీ ఆర్థిక విధానాన్ని ఆశ్రయించవలసి ఉంటుంది. అందుచేత లోటుదారీ ఆర్థిక విధానం వల్ల ద్రవ్యోల్బణపు పరిస్థితులు తలెత్తకుండా చూడవలసిన ఆవశ్యకత ఉంది. లోటుదారీ ఆర్థిక విధానం అనే ఆయుధాన్ని కడు జాగ్రత్తతో ప్రయోగించవలె. ఇది భారతదేశానికి ఒక సమస్యగా పరిణమించింది.

## ప్రణాళికల కాలంలో ధరల పెరుగుదల

మొదటి పంచవర్ష ప్రణాళిక (Five year plan) లక్ష్యాలలో ధరల పెరుగుదల ద్రవ్యోల్బణ ప్రవృత్తిని తగ్గించడం ఒకటి. ఆ లక్ష్యం మేరకు మొదటి పంచవర్ష ప్రణాళికలో విజయాన్ని సాధించడం జరిగింది. మొదటి పంచవర్ష ప్రణాళికా కాలంలో ఆహారోత్పత్తులు లక్ష్యాలను అధిగమించి పెరిగినాయి. ఇతర వస్తువుల ఉత్పత్తులు కూడా చెప్పుకోదగినంతగా పెరిగినాయి. అందువల్ల ధరలు 22% మేరకు పడిపోయినాయి. మొదటి ప్రణాళిక విజయ

వంతంగా అమలు కావడంతో ప్రజలు సంతోషించారు. వస్తువులు సమృద్ధిగా లభ్యమైనాయి. పైగా చవుకగా దొరికినాయి.

అయితే రెండో పంచవర్ష ప్రణాళికా కాలంలో ధరలు క్రమేణా, స్థిరంగా పెరగసాగినాయి. 1956-1961 సంవత్సరాల మధ్య సాధారణ ధరల స్థాయి (general price level) 30 శాతం మేరకు పెరిగింది. ధరలలో ఈ పెరుగుదలకు ముఖ్యకారణాలు :

ఎ) వ్యావసాయి లక్ష్యాలను (agricultural targets) చేరుకో లేక పోవడం.

బి) ప్రభుత్వ వ్యయంలో పెరుగుదల వల్ల ప్రజలయొక్క ద్రవ్యాదాయాలలో పెరుగుదల ఏర్పడింది. తత్ఫలితంగా వస్తుసేవలకు డిమాండ్ హెచ్చింది. ధరలు పెరగసాగినాయి.

పైన పేర్కొన్న మొదటి కారణంవల్ల అత్యవసర వస్తువుల (essential goods) కొరత ఏర్పడింది. రెండో కారణం వల్ల వస్తువులకు డిమాండ్ హెచ్చింది. ఈ రెండు కారణాలూ ధరల పెరుగుదలకు దోహదం చేసినాయి.

మూడో పంచవర్ష ప్రణాళికలో ధరల పరిస్థితి విషమించింది. దీనికి ప్రధాన కారణం – ఆహార వస్తువుల ధరలు పెరగడమే. జనాభా పెరుగుదల వల్లా, నగరాల విస్తరణ వల్లా, ద్రవ్యాదాయాల పెంపుదల వల్లా ఆహార ధాన్యాలకు డిమాండ్ పెరిగింది. అయితే ఆహారధాన్యా ఉత్పత్తులు డిమాండ్‌కు సరిపడినట్లుగా లేవు. 1965-66 సంవత్సరంలో దేశమంతటా క్షామ పరిస్థితులు ఉండటం వల్ల ఆహార ధాన్యా ఉత్పత్తులు తగ్గినాయి. 1964-65 సంవత్సరంలో ఆహార ధాన్యాల ఉత్పత్తి 89 మిలియన్ టన్నులు ఉండగా, 1965-66 సంవత్సరంలో 72 మిలియన్ టన్నులు మాత్రమే ఉంది. మూడో పంచవర్ష ప్రణాళికా కాలంలో ఆహార వస్తువుల ధరలు 39 శాతం మేరకు పెరిగినాయి. తయారీ వస్తువుల ధరలు 20 శాతం మేరకు పెరగడం జరిగింది. అన్ని వస్తువుల ధరలూ 35 శాతం మేరకు పెరిగినాయి.

నాలుగో పంచవర్ష ప్రణాళికా కాలంలో కూడా ధరల ధోరణి అధోముఖంగానే ఉంది. వాస్తవానికి మూడో పంచవర్ష ప్రణాళిక కాలంకంటె నాలుగో పంచవర్ష ప్రణాళికా కాలంలోనే ధరలు వేగంగా పెరిగినాయి: నాలుగో పంచవర్ష ప్రణాళికా కాలంలో ధరల ధోరణి ఎట్లా ఉందో కింది పట్టిక తెలియజేస్తుంది :

టోకుధరల సూచీ సంఖ్య

(ఆధార సంవత్సరం: 1961–62. 100)

| సంవత్సరం | ఆహార వస్తువులు | అన్ని వస్తువులు |
|---|---|---|
| 1969–70 | 200 | 176 |
| 1970–71 | 200 | 181 |
| 1971–72 | 217 | 192 |
| 1972–73 | 250 | 218 |
| 1973–74 | 322 | 284 |

మూలం : రిజర్వు బ్యాంక్ ఆఫ్ ఇండియా బులిటెన్, 1975

పైన ఇచ్చిన పట్టికను పరిశీలిస్తే వస్తువుల ధరలు ఎట్లా పెరిగినాయో సులభంగా అవగాహన కాగలదు. 1969–70 లో సాధారణ ధరల స్థాయి 176 ఉండగా 1973–74 సంవత్సరానికి 284 మేరకు చేరుకుంది. 1973–74 సంవత్సరంలో ఆహార పదార్థాల ధరలు (ఆహార ధాన్యాలు, పప్పు ధాన్యాలు, పంచదార, పాలు మొదలైనవి) 200 నుంచి 322 వరకు పెరిగినాయి. 1969 నుంచి ధరల పెరుగుదల ధోరణి స్థిరంగా ఉంది. 1972–73 వరకూ ధరలలో పెరుగుదల అంత వేగంగానూ, ఆందోళన కలిగించేదిగానూ లేదు. కాని 1973 ఏప్రిల్ నుంచి ధరలు ఆకాశాన్ని అందుకోజూస్తున్నట్టుగా పెరగనారంభించినాయి. నిత్యావసర వస్తువులు రోజు రోజుకూ, వారం వారానికీ కొద్దో గొప్పో పెరగసాగినాయి. ప్రజలు ధరలు పెరిగే తీరుచూసి భయపడనారంభించారు. ప్రభుత్వానికి ఆందోళన కారణమైంది. ధరలు త్వరితంగా పెరగడానికి కింది కారణాలు పేర్కొనవచ్చు :

i) హెచ్చు పన్నుల విధింపు.

ii) బంగ్లాదేశ్ నుంచి పెద్ద ఎత్తున కాందిశీకులు రావడం.

iii) 1971 డిసెంబరులో భారత దేశానికీ, పాకిస్తాన్‌కూ మధ్య యుద్ధం రావడం.

iv) పంటలు దెబ్బ తినడం.

v) విద్యుచ్ఛక్తి సప్లయ్ కొరతవల్ల పారిశ్రామిక ఉత్పత్తులు దెబ్బతినడం.

vi) ప్రభుత్వం గోధుమ వ్యాపారాన్ని స్వాధీనం చేసుకోవడంలో విఫలం కావడం.

vii) వర్తకులు నిత్యావసర వస్తువులను అక్రమంగా నిల్వచేయడం.

viii) నల్ల బజారు వ్యాపారం పెరిగిపోవడం.

పై కారణాల వల్ల భారతదేశం తీవ్రమైన ద్రవ్యోల్బణ ఒత్తిడులకు తట్టుకోవాల్సి వచ్చింది.

ధరల స్థాయి పెరుగుదల నాలుగో ప్రణాళికా కాలంలో అవిచ్ఛిన్నంగా జరిగింది. ఈ ప్రవృత్తి సెప్టెంబరు 1974 వరకూ నిరాటంకంగా కొనసాగింది (ఆ నెలలో ధరల సూచీసంఖ్య 330). ఆ తర్వాత ధరలు కొంచెం తగ్గుముఖం పడనారంభించినాయి. అందుకు ముఖ్య కారణం దేశంలో ద్రవ్యోల్బణాన్ని తగ్గించడానికి ప్రభుత్వం కొన్ని చర్యలు తీసుకోవడమే. వాటిల్లో పేర్కొనదగినవి:

ఎ) స్మగ్లర్ల వ్యవహారాలను అదుపులో పెట్టడం.

బి) డివిడెండ్ ఆదాయాలను ఘనీభవింపజేయడం (freezing)

సి) బ్యాంకు రేటును పెంచడం, మొదలైనవి.

అయిదో పంచవర్ష ప్రణాళికా కాలంలోనూ, ఆ తరవాతా ధరల పరిస్థితి ఎట్లా ఉందో కింది పట్టిక ద్వారా గ్రహించవచ్చు :

| సంవత్సరము | టోకుధరల సూచీసంఖ్య (1970-71=100) |
|---|---|
| 1973-74 | 140 |
| 1974-75 | 175 |
| 1975-76 | 173 |
| 1976-77 | 177 |
| 1977-78 | 186 |
| 1978-79 | 186 |
| 1979-80 | 204 |

సెప్టెంబరు 1974 తర్వాత ప్రభుత్వం ధరల పెరుగుదలను అరికట్టడానికి తీవ్రమైన చర్యలు తీసుకొన్నదని ఇంతకుముందే తెలియజేయడమైంది. ఆ చర్యల ఫలితంగా మార్చి 1976 వరకూ ధరలు కొంత మాత్రంగా అదుపులోకి వచ్చినాయి. అయితే మార్చి 1976 నుంచి ధరలు పెరగడం మొదలెట్టినాయి. ఆ పెరుగుదల గట్టులేని ప్రవాహంవలె కొనసాగింది. 1979 ఫిబ్రవరి నుంచి ధరల పెరుగుదల భయంకరంగా పెరుగుతూ, ప్రజలనూ, ప్రభుత్వాన్నీ, ఆర్థికమంత్రినీ, అర్థశాస్త్రవేత్తలనూ ఆందోళన పర్చసాగింది. ఆ పెరుగుదల ఇప్పటికీ కొనసాగుతూనే ఉంది. 1981 జూలైలో పెట్రోలియం, పెట్రోలియం వస్తువుల ధరలు పెంచిన దగ్గరనుంచీ ధరల పెరుగుదల మరీ విపరీతమైందని చెప్పవచ్చు. ధరల పెరుగుదలకు పెట్రోలియం ధరల పెరుగుదల ముఖ్య కారణంగా పరిగణించడం గమనించవలసిన అంశము. వస్తువుల ఉత్పత్తీ, రవాణా, పంపిణీ మొదలైనవన్నీ యాంత్రిక సాధనాలపై, వాహనాలపై ఆధారపడి ఉంటాయి. ఆ సాధనాలకు, వాహనాలకు అయ్యే పెట్రోల్ ధర హెచ్చితే, రవాణా ఖర్చు పెరుగుతుంది. వస్తువుల పంపిణీకి అయ్యే వ్యయం కూడా వస్తువు ధరలోనే చేర్చవలె కాబట్టి వస్తువుల ధరలు పెరగడంలో ఆశ్చర్యమేమీ లేదు. ధరల పెరుగుదలకూ, పెట్రోల్ ధర పెరుగుదలకూ పరస్పర సంబంధముంది.

మొదటి పంచవర్ష ప్రణాళిక దగ్గరనుంచీ ధరల ధోరణి పరిస్థితిని స్థూలంగా ఇట్లా ఉదాహరించవచ్చు.

మొదటి ప్రణాళిక — ధరలు 22% తగ్గినాయి.
రెండో ప్రణాళిక — ధరలు 30% పెరిగినాయి.
మూడో ప్రణాళిక — ధరలు 32% పెరిగినాయి.
నాలుగో ప్రణాళిక — ధరలు 61% పెరిగినాయి.
అయిదో ప్రణాళిక — ధరలు 105% పెరిగినాయి.

**టోకు ధరల సూచీ సంఖ్యలు (Index numbers of wholesale prices)**

టోకుధరల సూచీసంఖ్యలు దేశంలోని ధరల పరిస్థితిని తెలుపుతాయి. ధరల పరిస్థితిని ఒక సంవత్సరానికీ మరో సంవత్సరానికీ పోల్చుకోవడానికి ఈ సూచీ సంఖ్యలు ఉపయోగపడతాయి. సూచీ సంఖ్యల ఆధార సంవత్సరాన్ని ఇటీవల మార్చడం జరిగింది. 1961–62 = 100 ఆధారంగా ఉన్నదాన్ని 1977 ఏప్రిల్‌నుంచి 1970–7 = 100 ఆధారంగా శ్రేణులను (series) సవరించడం జరిగింది.

సవరించిన వర్గీకరణలో వస్తువులను ముఖ్యంగా మూడు వర్గాలకింద విభజించడమైంది

i) ప్రాథమిక వస్తువులు (primary articles)
ii) ఇంధనము, విద్యుచ్ఛక్తి, ల్యూబ్రికెంట్లు
iii) తయారీ ఉత్పత్తులు (manufactured products)

మొదటి వర్గాన్ని మళ్ళీ కొన్ని ఉపవర్గాలుగా వర్గీకరించడమైంది: అవి. ఆహార వస్తువులు ii) ఆహారేతర వస్తువులు (non-food articles) iii) ఖనిజాలు (minerals). మూడోవర్గం కిందఉన్న తయారీ ఉత్పత్తులను i) సగం తయారీ ఉత్పత్తులు (semi - manufactured) ii) తయారీ ఉత్పత్తులుగా విభజించడమైంది.

టోకుధరల సూచీ సంఖ్యలను 1971–72 సంవత్సరం నుంచి 1977–78 సంవత్సరం వరకు కింది పట్టికలో తెలియజేయడమైంది:

(ఆధారము. 1970-71=100)

| అంశము | బరువు | 1971-72 | 1972-73 | 1974-75 | 1975-76 | 1976-77 | 1977-78 |
|---|---|---|---|---|---|---|---|
| I ప్రాథమిక వస్తువులు | 416.67 | 100.9 | 110.7 | 177.5 | 165.8 | 167.2 | 183.8 |
| ఆహార వస్తువులు | 297.99 | 101.1 | 111.3 | 172.1 | 163.6 | 155.3 | 173.6 |
| ఆహారేతర వస్తువులు | 106.21 | 98.6 | 107.5 | 163.7 | 139.8 | 167.4 | 178.0 |
| నారపీచులు (Fibres) | 31.73 | 106.6 | 101.5 | 160.8 | 139.8 | 184.9 | 185.2 |
| నూనె గింజలు | 42.01 | 89.9 | 100.8 | 172.4 | 125.7 | 150.8 | 183.5 |
| ఖనిజాలు | 12.47 | 115.4 | 124.4 | 423.5 | 440.4 | 449.4 | 477.0 |
| II ఇంధనము, విద్యుచ్ఛక్తి, లూబ్రికెంట్లు | 84.59 | 105.9 | 110.1 | 198.3 | 219.2 | 230.8 | 234.3 |
| III తయారీ ఉత్పత్తులు | 498.74 | 109.5 | 121.9 | 168.8 | 171.2 | 175.2 | 181.7 |
| స్వాదుపానీయములు (beverages), పొగాకు, పొగాకు వస్తువులు | 27.08 | 106.80 | 112.4 | 148.2 | 164.7 | 168.2 | 171.2 |

| | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|
| వస్త్రాలు ... | 110.26 | 109.6 | 112.7 | 159.8 | 147.3 | 155.3 | 172.8 |
| కాగితం, కాగితం వస్తువులు | 8.51 | 110.4 | 114.3 | 184.8 | 183.2 | 180.1 | 184.5 |
| చర్మం, చర్మం వస్తువులు | 3.85 | 115.7 | 151.7 | 184.0 | 207.9 | 227.8 | 228.9 |
| రబ్బరు, రబ్బరు వస్తువులు | 12.07 | 101.7 | 108.7 | 140.0 | 156.9 | 157.2 | 156.9 |
| రసాయనాలు, రసాయనిక వస్తువులు | 55.48 | 101.5 | 105.0 | 168.8 | 175.6 | 171.4 | 172.8 |
| లోహేతర ఖనిజ వస్తువులు | 14.15 | 109.3 | 116.2 | 163.3 | 187.9 | 191.0 | 194.6 |
| మూలలోహాలు, లోహ వస్తువులు | 59.74 | 104.7 | 113.9 | 172.6 | 184.8 | 190.1 | 193.8 |
| యంత్రాలు, రవాణాసామగ్రి | 67.18 | 105.3 | 112.1 | 156.4 | 172.6 | 170.1 | 172.6 |
| చిల్లర మల్లర వస్తువులు | 7.20 | 102.5 | 110.2 | 168.5 | 167.8 | 166.0 | 179.4 |
| IV అన్ని వస్తువులు | 1,000 | 105.6 | 116.2 | 174.9 | 173.0 | 176.6 | 185.8 |

మూలం : ఇండియా, 1979

## వినియోగదారు ధరలు (consumer prices)

పారిశ్రామిక కార్మికులకు వినియోగ ధర సూచీ సంఖ్యలను (consumer price index numbers) 1969–70 నుంచి 1977–78 వరకూ కింద పట్టికలో ఇవ్వడం జరిగింది. ఈ సంఖ్యలు కొన్ని పట్టణాలకు సంబంధించినవి. కింది పట్టికను పరిశీలిస్తే 1976–77 లో అఖిల భారత సాధారణ సూచీ (All - India general index) అంతకు క్రితం సంవత్సరంకంటె 12 పాయింట్లు తగ్గినట్టు తెలియ వస్తుంది. అయితే 1977–78 సంవత్సరంలో అఖిల భారత సాధారణ సూచీ 23 పాయింట్లకు పెరిగింది. అఖిల భారత ఆహారసూచీ (All-India food index) 28 పాయింట్లు పెరిగింది.

రిజర్వు బ్యాంక్ ఆఫ్ ఇండియా, కేంద్ర డైరక్టర్ల బోర్డు (Central Board of Directors) వారు ఇటీవల విడుదల చేసిన జూన్ 30, 1982 నాటి సాంవత్సరిక నివేదిక ప్రకారం టోకు ధరల సూచీ 21 మాత్రమే ఈ 1981–82 లో పెరిగింది. 1980–81 లో ఈ సూచీ 16.7 శాతం ఉంది. వ్యావసాయిక, పారిశ్రామిక ఉత్పత్తులలో పెరుగుదల, ధరల పెరుగుదలలో తగ్గుదల - ఆర్థిక వ్యవస్థ పటిష్ఠతకు దోహదం చేస్తాయని రిజర్వు బ్యాంకు విశ్వాసము.

(ఆధారము : 1960=100)

## పారిశ్రామిక కార్మికులకు వినియోగదారు ధర సూచీ సంఖ్యలు
## (Consumer Price Index Numbers for Industrial workers)

| సంవత్సరము | బొంబాయి | అహమ్మదాబాద్ | కలకత్తా | మద్రాసు | కాన్పూర్ | ఢిల్లీ | మొత్తం భారతదేశము అన్నివస్తువులు | మొత్తం భారతదేశము ఆహారము |
|---|---|---|---|---|---|---|---|---|
| 1969–70 | 175 | 169 | 172 | 160 | 182 | 185 | 177 | 193 |
| 1970–71 | 182 | 176 | 182 | 170 | 190 | 199 | 186 | 204 |
| 1971–72 | 190 | 181 | 187 | 182 | 196 | 211 | 192 | 205 |
| 1972–73 | 203 | 198 | 197 | 203 | 212 | 222 | 207 | 223 |
| 1973–74 | 233 | 245 | 228 | 229 | 251 | 265 | 250 | 279 |
| 1974–75 | 289 | 305 | 288 | 301 | 323 | 337 | 317 | 358 |
| 1975–76 | 300 | 293 | 287 | 314 | 299 | 333 | 313 | 342 |
| 1976–77 | 298 | 281 | 297 | 288 | 294 | 332 | 301 | 317 |
| 1977–78 | 318 | 310 | 320 | 311 | 330 | 358 | 324 | 345 |

మూలం : ఇండియా, 1979.

(ఆధారము : 1960–100)

పట్టణ ప్రాంతపు శారీరక శ్రమ చేయని ఉద్యోగుల వినియోగదారు ధర సూచీ సంఖ్యలు
(Consumer Price Index Numbers For Urban Non-Manual Employees)

| సంవత్సరము | బొంబాయి | కలకత్తా | మద్రాసు | ఢిల్లీ | మొత్తం భారతదేశము |
|---|---|---|---|---|---|
| 1970–71 | 168 | 170 | 175 | 174 | 174 |
| 1971–72 | 172 | 174 | 188 | 180 | 180 |
| 1972–73 | 183 | 180 | 204 | 190 | 192 |
| 1973–74 | 204 | 204 | 231 | 217 | 221 |
| 1975–76 | 246 | 243 | 306 | 274 | 277 |
| 1976–77 | 255 | 251 | 294 | 274 | 277 |
| 1977–78 | 269 | 265 | 311 | 288 | 296 |

మూలం : ఇండియా, 1979.

ధరల పెరుగుదలా, ద్రవ్యోల్బణం భారత దేశంలో ఎట్లా ఉందో దాదాపు ఆంధ్రప్రదేశ్‌లో కూడా అట్లానే ఉంది. అయితే వస్తువుల ధరవరల పోకడలో కొద్దిమార్పులు ఉండవచ్చు.

ఆంధ్రప్రదేశ్‌లో కొన్ని వస్తువుల ధరల తీరుతెన్నులు ఇట్లా ఉన్నాయి.

(క్వింటాల్ రూ॥లలో)

| వస్తువు | 1973 | 1978 | 1979 | 1980 |
|---|---|---|---|---|
| పంచదార | 380 | 400 | 225 | 700 |
| బెల్లం | 190 | 195 | 162 | 240 |
| పెసలు | 177 | 272 | 280 | 340 |
| సన్న బియ్యం | 231 | 237 | 227 | 230 |
| ఎండుమిర్చి | 500 | 655 | 650 | 690 |
| నువ్వులు | 425 | 450 | 415 | 520 |
| చింతపండు | 485 | 370 | 525 | 600 |
| నువ్వులనూనె | 800 | 1,000 | 1,070 | 1,120 |

ఆంధ్రప్రదేశ్‌లో జనవరి, ఫిబ్రవరి, మార్చి నెలల్లో కొన్ని వస్తువుల చిల్లర ధరలు (retail prices) ప్రవృత్తి ఎట్లా ఉందో కింది పట్టికద్వారా పరిశీలించవచ్చు :

(కిలో ధర)

| వస్తువు | జనవరి 81 | ఫిబ్రవరి 81 | మార్చి 81 |
|---|---|---|---|
| బియ్యం–ఒకటోరకం | 2–52 | 2–56 | 2–56 |
| బియ్యం–రెండోరకం | 2–09 | 2–20 | 2–22 |
| గోధుమ | 1–46 | 1–46 | 1–46 |
| జొన్నలు (తెల్లవి) | 1–61 | 1–63 | 1–68 |
| జొన్నలు (పసుపు పచ్చవి) | 1–34 | 1–39 | 1–43 |

| | | | |
|---|---|---|---|
| వేరుసెనగనూనె | 13–48 | 13–95 | 13–36 |
| కొబ్బరినూనె | 21–56 | 21–58 | 20–48 |
| వనస్పతి | 13–77 | 14–66 | 14–33 |
| పంచదార | 6–77 | 6–92 | 6–93 |
| బెల్లం | 3–96 | 3–85 | 4–03 |
| చింతపండు | 7–60 | 6–84 | 6–79 |
| ఎండుమిర్చి | 6–75 | 7–88 | 9–67 |
| పాలు | 2–44 | 2-48 | 2–48 |
| మాంసం | 17 14 | 17 29 | 17 48 |
| బొగ్గు (క్వింటాల్) | 87–26 | 87–33 | 87–57 |

మూలం : అర్థ, గణాంక శాఖ, ఆం. ప్ర.

# 4

# ధరల పెరుగుదలకు కారణాలు

ధరల పెరుగుదల ప్రపంచవ్యాప్తంగా వ్యాపించిన దీర్ఘకాలిక వ్యాధి. ధరల పెరుగుదలను మార్కెట్ అర్థశాస్త్రం (Market Economics) యొక్క అవిధేయ శిశువుగా అభివర్ణించవచ్చు. ధరల పెరుగుదల ప్రభావానికి లోనుకాని వారు ఎవ్వరూ ఉండరు. అంతే కాకుండా ప్రామాణిక విధాన చర్యలకు అంత సులభంగా లొంగరు. ధరల పెరుగుదల వేగాన్ని అరికట్టడానికి ప్రపంచంలో ప్రతిదేశమూ శక్తివంచన లేకుండా చర్యలు తీసుకొంటూనే ఉంది. అయితే ఆ చర్యలు అంతగా ఫలించడం లేదు. ధరలు కొన్ని దేశాల్లో తాత్కాలికంగా తగ్గినా, మళ్ళీ పెరుగుతూనే ఉన్నాయి.

ధరల పెరుగుదలకు ప్రధాన కారణం — ఎక్కువ ద్రవ్యం (exeess of money) అని 1568 లో జీన్ బోడిన్ (Jean Bodin) సిద్ధాంతరీకరించడం జరిగింది. ఈ సిద్ధాంతాన్ని అంటే ద్రవ్యోల్బణానికి మూలహేతువు ద్రవ్యవాదం (monetarism) అనే దాన్ని అమెరికాలో రీగన్, ఇంగ్లాండ్‌లో థాచర్, జర్మనీలో స్కిమిడ్ ప్రగాఢంగా విశ్వసిస్తున్నారు. ద్రవ్యవాదం ప్రకారం ద్రవ్యరాశికి (quantity of money), సాధారణ ధరల స్థాయికి స్థిరమైన సంబంధముంది. ద్రవ్యం సప్లయ్‌లో హెచ్చు తగ్గులననుసరించి ధరలు సర్దుబాటు అవుతాయి. ద్రవ్యం సప్లయ్ విపరీతంగా పెరిగితే ధరలు పెరుగుతాయనీ, ద్రవ్యం సప్లయ్ తగ్గితే ధరలు తగ్గుతాయని కొంతమంది అర్థశాస్త్రజ్ఞులు, రాజనీతిజ్ఞులు నమ్ముతున్నారు. అంతర్జాతీయ ద్రవ్యోల్బణాన్ని అర్థం చేసుకోవడానికి ద్రవ్యవాదాన్ని ఇటీవలి కాలంలో సాధారణీకరణం (generalisation) చేయడం జరిగింది. అంతర్జాతీయ ద్రవ్యవాదం (International monetarism) ద్రవ్యం సప్లయ్‌కి ప్రాముఖ్యమిస్తూన్నది. స్థిరమైన వినిమయ మారకపు రేట్లతో (exchange rates) దేశాలు ఉంటే, ఒక దేశంలోని ద్రవ్యోల్బణం మరో దేశంలోని ధరల పెరుగుదలకు కారణం కాగలదు.

ఆర్థిక వ్యవస్థలోని నిర్మాణాత్మక కారణాలు (structural factors) అభివృద్ధి చెందుతూన్న దేశాలలోని ద్రవ్యోల్బణానికి దోహదక్రియలని ఒక వాదం బయలుదేరింది. ఈ వాదం లాటిన్ అమెరికన్ దేశాలకు వర్తిస్తుంది. ఈ వాదం ప్రకారం అవస్థాపనా అడ్డంకులు (infrastructural bottle necks), ఆహార పదార్థాల కొరతలు, మూల్య న్యూనీకరణలు (devaluations) ధరల పెరుగుదలకు దారితీస్తాయి. అంతేకాకుండా సాపేక్ష ధరల మార్పులు (relative price changes) మొత్తం ధర స్థాయిలో ప్రభావాన్ని కలిగిస్తాయని ఈ వాదం తెలియజెప్పుతుంది. ఉదాహరణకు, ఆహార పదార్థాల కొరతవల్ల ఆహార పదార్థాల ధరలు పెరగడమే కాకుండా, సాపేక్షంగా మిగతా వస్తువుల ధరలుకూడా పెరుగుతాయి. అయితే ఈ వాదాన్ని ద్రవ్యవాదులు (monetarists) పూర్తిగా త్రోసిపుచ్చారు. వారి వాదం ప్రకారం సాపేక్ష ధరల మార్పులకు సాధారణ ధరల స్థాయి అంతగా ప్రభావితంకాదు. కాని పెట్రోలియం, పెట్రోలియం వస్తువుల ధరల పెరుగుదలను పరిశీలిస్తే, సాపేక్ష ధరల మార్పుల ప్రభావాన్ని కాదనలేము. దేశంలో పెట్రోల్ ధరలు పెరిగితే, దాని ప్రభావం సాధారణ ధరల స్థాయిమీద ముమ్మరంగా ఉండే విషయం మన అనుభవంలో చూశాము.

## ధరల పెరుగుదలకు కారణాలు

ధరలు ఊర్ధ్వముఖంగా పెరుగుతూన్న విషయం అందరికీ తెలిసిందే. ఒక్క వస్తువు ధరకాదు; ఆహార ధాన్యాలు, పారిశ్రామిక వస్తువులు, నిత్యావసర వస్తువులు, విలాస వస్తువులు – అన్నింటి ధరలూ పెరుగుతూనే ఉన్నాయి. బియ్యం, పప్పులు, నూనెలు, కాయగూరలు, టూత్ పేస్టులు, బట్టలు, అగ్గిపెట్టెలు, సిమెంట్, ఇనుము, ఉక్కు – ఒకటేమిటి, ఏ వస్తువు ధర నిలకడగా ఉందో; ఏ వస్తువు ధర పెరగలేదో చెప్పడం కష్టము. అందుచేత స్థూలంగా అన్ని వస్తువుల ధరలు పెరుగుతున్నాయని చెప్పవచ్చు. ధరల పెరుగుదలకు ఎన్నో కారణాలను చెప్పుకోవచ్చు. ధరల పెరుగుదలకు ఎన్నో క్రియలు, ప్రక్రియలు దోహదం చేసినాయి వాటిని సంగ్రహంగా కింద వివరించడం జరిగింది :

*1. జనాభా పెరుగుదల ఒత్తిడి :* మన దేశంలో 1951 నుంచీ జనాభా పెరుగుదల వేగంగా పెరగసాగింది. మన దేశంలో జనాభా పెరుగుదల ధోరణి ఎట్లా ఉందో కింది పట్టిక ద్వారా గమనించవచ్చు.

| సంవత్సరం | జనాభా పరిమాణం (మిలియన్లు) |
|---|---|
| 1901 | 236 |
| 1911 | 252 |
| 1921 | 251 |
| 1931 | 279 |
| 1941 | 319 |
| 1951 | 361 |
| 1961 | 439 |
| 1971 | 546 |
| 1981 | 648 |

ప్రతి సంవత్సరం పెరుగుతూన్న జనాభాకు ఆహార పదార్థాలను ఇతర ఆవశ్యక వస్తువు ను సమకూర్చవలసి ఉంది. ఎక్కువ జనాభా అంటే వస్తువులకు డిమాండ్ ఎక్కువ అన్నమాట. డిమాండ్ ప్రకారం వస్తువుల సప్లయ్ లభించకపోతే ధరలు పెరగడం సహజము.

*2. హెచ్చు పెట్టుబడి రేటు* (High Rate of Investment) : ప్రణాళికా బద్ధమైన కృషిలో, ఆర్థికాభివృద్ధి సాధన నిమిత్తం ప్రభుత్వ, ప్రయివేటు రంగాలలో హెచ్చు మొత్తాలలో పెట్టుబడి పెట్టడం జరిగింది. 1951-1974 మధ్య 32,000 కోట్ల రూపాయలను పెట్టుబడిగా వినియోగించడమైంది. వివిధ పంచవర్ష ప్రణాళికలలో ప్రభుత్వ, ప్రయివేటు రంగాలకింద వినియోగించిన మొత్తాలు. :

| | ప్రభుత్వరంగము | ప్రయివేటురంగము (రూ : కోట్లలో) |
|---|---|---|
| మొదటి ప్రణాళిక | 1,960 | 1,800 |
| రెండో ప్రణాళిక | 4,672 | 3,100 |
| మూడో ప్రణాళిక | 8,577 | 4,190 |
| వార్షిక ప్రణాళికలు | 6,757 | 2,910 |
| నాలుగో ప్రణాళిక | 15,779 | 8,385 |
| అయిదో ప్రణాళిక | 39,304 | 27,049 |

మూలం : ఇండియా, 1979

ప్రభుత్వ, ప్రయివేటు రంగాలలో హెచ్చు పెట్టుబడి వినియోగం వల్ల వస్తు సేవలకు డిమాండ్ హెచ్చు అవుతుంది. సప్లయ్ ఆ మేరకు పెంచకపోతే, హెచ్చు డిమాండ్ ధరల పెరుగుదలకు కారణ భూతమవుతుంది.

*3. ప్రభుత్వ వ్యయం పెరుగుదల :* కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాల వ్యయాలు సంవత్సరం సంవత్సరం పెరుగుతున్నాయి. 1950–51 లో ప్రభుత్వ వ్యయం రూ. 900 కోట్లు ఉండగా, 1979–80 నాటికి రూ. 30,000 కోట్ల మేరకు పెరిగింది. ఈ వ్యయం వస్తు సేవల డిమాండ్‌కు దారితీస్తుంది. చివరకు ధరలు పెరగడానికి ఒక కారణమవుతుంది. ప్రభుత్వ వ్యయాలవల్ల ప్రజలు ఆదాయాలు పెరుగుతాయి. ప్రజలలో కొనుగోలు శక్తి పెరుగుతుంది.

*4. ద్రవ్యం సప్లయ్‌లో పెరుగుదల :* ప్రజల దగ్గరున్న ద్రవ్యం ఏటేటా పెరుగుతూన్నది. ధరల పెరుగుదలకు దీనిని ప్రధాన కారణంగా చెప్పవచ్చు. 1951–52లో ద్రవ్యం సప్లయ్ రూ. 1,850 కోట్లు ఉండగా, 1978–79 నాటికి రూ. 22.000 కోట్లకు పెరిగింది. ఈ పెరుగుదల అవాంఛనీయమైంది. ప్రజల దగ్గర ద్రవ్యాదాయాలు అధికంగా ఉంటే వస్తువులను అధికంగా కొంటారు. వస్తువులకు డిమాండ్ పెరుగుతుంది. సప్లయ్ చాలినంతగా లేకపోతే ధరలు విజృంభిస్తాయి. ద్రవ్యం సప్లయ్‌తోపాటు వాస్తవిక జాతీయాదాయం

అభివృద్ధి చెందకపోతే ధరల పెరుగుదలకు హేతువు కాగలదని వేరే చెప్పనక్కర్లేదు. కింది పట్టికద్వారా గత కొద్ది సంవత్సరాలలో ద్రవ్యం సప్లయ్, వాస్తవిక జాతీయాదాయం పరిస్థితిని గ్రహించవచ్చు.

గత సంవత్సరంమీద శాతం పెరుగుదలలు
(Percentage increases over previous year)

| సంవత్సరం | ద్రవ్యం సప్లయ్ | వాస్తవిక జాతీయాదాయం |
|---|---|---|
| 1976–77 | 18.8 | 1.3 |
| 1977–78 | 17.8 | 8.2 |
| 1978–79 | 18.7 | 4.1 |
| 1979–80 | 16.0 | 3.0 |
| సగటు పెరుగుదల . | 17.8 | 2.7 |

మూలం : ఇలస్ట్రేటెడ్ వీక్లీ, 6–7–1980

పై పట్టికను పరిశీలిస్తే ద్రవ్యం సప్లయ్ సగటు పెరుగుదల 17.8 శాతం ఉండగా, వాస్తవిక జాతీయాదాయం పెరుగుదల రేటు 2.7 మాత్రమే ఉంది.

5. నల్లధనం (Black Money) : దేశంలో ధరల పెరుగుదలకు దోహదం చేసే ప్రక్రియల్లో నల్లధనం పాత్ర చెప్పుకోదగింది. వర్తకులు, వ్యాపారస్తులు, ఉత్పత్తిదార్లు, పారిశ్రామిక వేత్తలు మొదలైనవారి దగ్గర పెద్ద మొత్తాలలో నల్లధనం ఉన్నదనే విషయం నగ్నసత్యము. ఈ నల్లధన స్వాములనుంచి నల్లధనాన్ని తెల్లధనం (white money) చేయడానికి ప్రభుత్వం ఎన్నో చర్యలు తీసుకుంది. అయినప్పటికీ అవి ఆశించిన ఫలితాలను సాధించలేక పోయినాయి. నల్లధనమంటే ఆదాయపు పన్ను, ఇతర పన్నులు ఎగవేస్తూ, బ్లాక్ మార్కెట్ ద్వారా అక్రమంగా కూడబెట్టిన, ఖాతాలకు అందని డబ్బు. నల్లధనాన్ని ఆయుధంగా ఉపయోగించి వర్తకులు నిత్యావసర వస్తువుల సప్లయ్‌లను తమ అధీనంలో ఉంచుకొంటూ ధరలను

పెంచగలుగుతున్నారు. అక్రమ లాభార్జనలను పొందగలుగుతున్నారు. దేశంలో నల్లధనం ఎన్ని వందల కోట్లమేరకు ఉందో అంచనా వేయడం అతికష్టము. అయినప్పటికీ దేశంలో ఉన్న నల్లధనం అంచనాలు ఇట్లా ఉన్నాయి :

| సంవత్సరం | రూ. కోట్లలో |
|---|---|
| 1969–70 | 3,080 |
| 1975–76 | 7,366 |
| 1976–77 | 9,016 |
| 1977–78 | 10,855 |
| 1978–79 | 13,145 |
| 1979–80 | 15,432 |
| 1980–81 | 18,241 |

మూలం బిజినెస్ స్టాండర్డ్ 30.11.82

అయితే నల్లధనం అధిక పరిమాణంలో ఉండటంవల్ల ధరలు పెరుగుతున్నాయని ఖచ్చితంగా చెప్పవచ్చు.

*6*. సప్లయ్ శక్తులు (Supply forces). జనాభా పెరుగుదల, ద్రవ్యం సప్లయ్‌లో పెరుగుదల—ఈ రెండూ వస్తుసేవల డిమాండ్‌కు మార్గం కల్పిస్తాయనడంలో అతిశయోక్తి లేదు. తత్ఫలితంగా ధరలు పెరుగుతాయి. అయితే డిమాండ్‌తో సమానంగా వస్తు, సేవల సప్లయ్‌ని పెంచగలిగితే ధరలు పెరిగే అవకాశంలేదు. కాని దురదృష్ట వశాత్తు మన మార్కెట్ వ్యవస్థలో డిమాండ్, సప్లయ్‌లు జంట కవులు కావు. రెండింటికీ పొత్తులేదు. రెండూ సమతూకంగా ఉండవు. అందుచేతనే ధరలు స్థిరంగా, అవిచ్ఛిన్నంగా, నిరాటంకంగా పెరుగుతున్నాయి. 1950–51 సంవత్సరం నుంచి ప్రణాళికా బద్ధమైన కృషివల్ల ఆహార ధాన్యాల ఉత్పత్తి పెరుగుతూనే వచ్చింది. 1950–51 లో ఆహార ధాన్యాల ఉత్పత్తి 55 మిలియన్ టన్నులుండగా

1964–65 లో 89 మిలియన్ టన్నులకు చేరుకొంది. అయితే ఆహార ధాన్యాల ఉత్పత్తి 1965–66 సంవత్సరంలో 72 మిలియన్ టన్నులకు, 1966–67లో 76 మిలియన్ టన్నులకు పడిపోవడం జరిగింది. ఆహార ధాన్యాల ఉత్పత్తిలో ఈ తగ్గుదల ధరలపై ఎంతో ప్రభావాన్ని చూపింది.

ఆహార ధాన్యాల ఉత్పత్తి

| | (మిలియన్ టన్నులు) |
|---|---|
| 1950–51 | 55 |
| 1960–61 | 82 |
| 1970–71 | 107 |
| 1972 73 | 97 |
| 1973–74 | 104 |
| 1974–75 | 99 |
| 1975–76 | 121 |
| 1976–77 | 111 |
| 1977–78 | 125 |

మూలం : ఇండియా, 1979

మార్కెట్‌లోకి వచ్చే ఆహార ధాన్యాల పరిమాణం తగ్గిపోతూన్నది. పెద్ద వ్యవసాయదార్లు, వ్యాపారస్తులు ఆహార ధాన్యాలను నిల్వచేయడంతో ఆహార ధాన్యాల ధరలు పెరగక తప్పడం లేదు. ఆహార ధాన్యాల ధరలను తగ్గించే తలంపుతో ప్రభుత్వం భారీ ఎత్తున విదేశాలనుంచి ఆహార ధాన్యాలను దిగుమతి చేసుకొంటూన్నది. అయితే ఆహార ధాన్యాల డిమాండ్ – సప్లయ్‌ల మధ్యఉన్న అగాధాన్ని పూడ్చడానికి ప్రభుత్వం తీసుకొన్న చర్యలు అంతగా ఉపయోగపడటం లేదు.

మన దేశంలో ఆహారధాన్యాల ఉత్పత్తి స్థిరమైన పెరుగుదలతో లేదు. వర్షాభావం, వరదలు, ప్రకృతి భీభత్సాలు మొదలైన కారణాల వల్ల ఒక్కొక్క సంవత్సరంలో ఆహార ధాన్యాల ఉత్పత్తి చాల తక్కువగా ఉంటూన్నది. విదేశాలనుంచి ఆహార ధాన్యాలను దిగుమతి చేసుకోవడం అంత సులభంకాదు. వీటిని స్వప్రయోజనాల కోసం వినియోగించుకొని టోకు వర్తకులు, చిల్లర వర్తకులు బ్లాక్ మార్కెటింగ్‌కు పాల్పడటం జరుగుతూన్నది. అందువల్ల ఆహార ధాన్యాలు కొరతగా ఉన్నప్పుడు ధరల పెంపుకు ప్రయత్నించడం కద్దు. వర్తకుల సమాజ వ్యతిరేక (anti-social) కార్యకలాపాలు ధరల పెరుగుదలకు దోహదం చేస్తున్నాయి. ఈ సమాజ వ్యతిరేక కార్యకలాపాలను అరికట్టడంలో ప్రభుత్వం విఫలమవుతూన్నది. భారతదేశము ప్రధానంగా వ్యావసాయిక దేశం కాబట్టి, ఆహార ధాన్యాల ధరలలో పెరుగుదల ప్రభావం మిగతా వస్తువుల ధరలపై తప్పకుండా ఉంటుందనడంలో సందేహం లేదు.

7. *తయారీ వస్తువుల సప్లయ్* (Supply of Manufactured goods): గత కొద్ది సంవత్సరాలుగా తయారీ వస్తువుల ఉత్పత్తి అంత సంతృప్తి కరంగా లేదు. డిమాండ్ మేరకు పారిశ్రామిక వస్తువుల సప్లయ్ లభించడం లేదు. పారిశ్రామిక ఉత్పత్తులలో మందకొడితనం ఏర్పడటానికి, అనుకొన్న లక్ష్యాల మేరకు చేరుకోకపోవడానికి ముఖ్య కారణాలుగా i) విద్యుచ్ఛక్తి నిలుపుదలలు (Power - breakdowns), ii) సమ్మెలు - లాకౌట్లు iii) రవాణా సౌకర్యాల కొరత iv) వనరులను అభిలషణీయమైన పరిమాణంలో వినియోగించుకోలేకపోవడం-పేర్కొనవచ్చు. పారిశ్రామిక వస్తువులకు హెచ్చు డిమాండ్ ఉండటంతో ఉత్పత్తిదార్లు అధికలాభాల కాంక్షతో ఎక్కువ ధరలను రాబట్టుకొనే పరిస్థితిలో ఉన్నారు.

పారిశ్రామిక ఉత్పత్తుల సూచీ సంఖ్యలు ఇట్లా ఉన్నాయి :

ఆధారము : 1970=100)

| | 1975-76 | 1976-77 | 1977-78 |
|---|---|---|---|
| సాధారణ సూచీ | 122.7 | 134.3 | 139.6 |
| విద్యుచ్ఛక్తి | 145.0 | 162.1 | 167 6 |
| వస్త్రాలు | 105.5 | 103.9 | 104.7 |
| పాదరక్షలు | 92.7 | 91.7 | 73.0 |
| కాగితం వస్తువులు | 109.2 | 111.1 | 115.2 |
| రసాయనాలు | 136.8 | 161.5 | 172.3 |
| పెట్రోలియం రిఫైనరీ వస్తువులు | 122.6 | 125.9 | 137.0 |
| ప్రాథమిక లోహ పరిశ్రమలు | 121.5 | 143.7 | 143.1 |
| ఎలక్ట్రికల్ యంత్రాలు | 120.3 | 133.8 | 141.0 |
| రవాణా సామగ్రి | 114.7 | 124.8 | 123.0 |

మూలం : ఇండియా, 1979

*8. ప్రభుత్వ విధానాలలో లోపము:* ప్రభుత్వం కొన్ని విధానాలను అనుసరించడంలో విఫలం కావడం వల్ల కూడా ధరలు పెరిగే ప్రమాదమున్నది. ఉదాహరణకు, ఏప్రిల్ 1973లో గోధుమ టోకు వ్యాపారాన్ని జాతీయం చేయడానికి ప్రభుత్వం నిర్ణయం తీసుకుంది. అయితే ఆ నిర్ణయాన్ని ప్రభుత్వం అమలు పర్చడంలో విఫలమైంది. వర్తకులు గోధుమను భారీఎత్తున నిల్వచేయడంతో ధరలు పెరిగినాయి.

*9. పెట్రోలియం ధర పెరుగుదల :* ఈ సంవత్సరంలో (1981) పెట్రోలియం, పెట్రోలియం వస్తువుల ధరలను మూడుసార్లు పెంచడం జరిగింది. దీనివల్ల 0.7 శాతం ద్రవ్యోల్బణం అధికమవుతుందని అర్థశాస్త్రజ్ఞులు భావిస్తున్నారు. పెట్రోలియం ధర పెరగడంతో

రవాణా సౌకర్యాల వ్యయం ఎక్కువ అవుతుంది. మన నిత్య జీవితం, నిత్యావసర వస్తువులు రవాణా సౌకర్యాలతో ముడిపడి ఉన్నాయి. కాబట్టి పెట్రోలియం, పెట్రోలియం వస్తువులు, వంటగ్యాసు మొదలైన ధరల పెరుగుదల సాధారణ ధరల స్థాయిపై సాపేక్ష ప్రభావాన్ని చూపుతుంది. ఆరు నెలల్లో పెట్రోలు ధర 94 పైసలు, డీజిల్ ధర 72 పైసలు, వంటగ్యాసు ధర 10 రూపాయలు పెరగడంతో అగ్నికి ఆజ్యం పోసినట్లయింది. పెట్రోలియం ఉత్పత్తుల ధర పెంచడం ద్వారా వాడకందార్ల మీద దాదాపు నూరు కోట్ల రూపాయల భారం పడిందని అర్థశాస్త్రవేత్తలు భావిస్తున్నారు.

*10. ఎగుమతుల దిగుమతుల మధ్య వ్యత్యాసము:* ఒక దేశం ఎగుమతుల కంటె దిగుమతులు ఎక్కువగా చేసుకొంటే, ద్రవ్యోల్బణం కూడా సరుకులతో పాటు దిగుమతి అయ్యే ప్రమాదముంది. మన దేశం సరుకులను ఎగుమతి చేయడంకంటె దిగుమతులనే ఎక్కువ చేసుకొంటూన్నది. అభివృద్ధి దశలో ఉన్న దేశాలకు ఈ పరిస్థితి అనివార్యమని చెప్పవచ్చు. మన దేశపు వర్తకపు శేషం (balance of trade) 1954-55 నుంచి ప్రతికూలంగా ఉంది. అందుకు ముఖ్య కారణం మనం దిగుమతులను ఎక్కువ చేసుకోవడమే. ఆహార ధాన్యాలు, పంచదార, వంట నూనెలు, యంత్ర పరికరాలు, ఇనుము ఉక్కు, రవాణా సామగ్రి, ముడి పెట్రోలియం, ఎరువులు మొదలైన వాటిని యునైటెడ్ కింగ్‌డమ్, అమెరికా, రష్యా, బెల్జియమ్, జర్మనీ, ఇరాన్, ఇటలీ, జపాన్ మొదలైన దేశాలనుంచి దిగుమతి చేసుకుంటున్నాము.

మన దేశపు విదేశీ వ్యాపారం (foreign trade) ధోరణులను కింది పట్టికనుంచి గమనించవచ్చు.

(రూ. కోట్లలో)

| సంవత్సరము | దిగుమతులు | ఎగుమతులు | వర్తక శేషము |
|---|---|---|---|
| 1950-51 | 650.21 | 600.44 | -49.57 |
| 1960 61 | 1,139.69 | 660.22 | -479.47 |

| | | | |
|---|---|---|---|
| 1965-66 | 1,408.53 | 805.64 | −602.89 |
| 1970-71 | 1,634.20 | 1,535.16 | − 99.04 |
| 1973 74 | 2,955.37 | 2,523.40 | −432.97 |
| 1974 75 | 4,518.78 | 3,328.83 | −1,189.95 |
| 1975 76 | 5,264.78 | 4,036.26 | −1,228.52 |
| 1976 77 | 5,073.95 | 5,145.78 | + 71.83 |
| 1977 78 | 6,068.60 | 5,375.08 | −693.52 |

మూలం : ఇండియా, 1979

దిగుమతి వస్తువుల ధరలలో పెంపుదల దేశంలోని వస్తువుల ధరల పెంపుదలకు ఆధార భూతమవుతుందని అనుభవం వల్ల వెల్లడైంది. దిగుమతి వస్తువుల ధరలలో 1 శాతం పెరుగుదల దేశీయ వస్తువులలో 0.3 శాతం పెరుగుదలకు హేతువు కాగలదు. అందు చేతనే భారతదేశం ఎక్కువ దిగుమతుల ద్వారా ద్రవ్యోల్బణాన్ని కూడా దిగుమతి చేసుకొంటూన్నదని ఒక అర్థశాస్త్రజ్ఞుడు వ్యాఖ్యానించినాడు. 1979 80 సంవత్సరంలో మన దిగుమతులు, ఎగుమతుల మధ్య దాదాపు 3 వేల కోట్ల రూపాయల తేడా ఉన్నట్లు తెలుస్తూన్నది.

ధరల పెరుగుదలకు ప్రధానమైన కారణాలను పైన వివరించడం జరిగింది. అంతేకాకుండా కింద పేర్కొన్న కారణాలు కూడా ధరల పెరుగుదలకు ప్రత్యక్షంగానో, పరోక్షంగానో దోహదం చేస్తాయి :

i) ప్రభుత్వ పంపిణీ వ్యవస్థ సక్రమంగా పనిచేయకపోవడం
ii) అభివృద్ధికి తోడ్పడని వ్యయంలో పెరుగుదల
iii) ఆడంబర వ్యయము
iv) బ్యాంకు పరపతి ఉదారంగా ఇవ్వడం

# 5

# ధరల పెరుగుదల ప్రభావాలు

ద్రవ్యోల్బణం 'డయాబిటిస్' జబ్బు వంటిది. దానిని కంట్రోల్‌లో ఉంచవచ్చుగానీ, పూర్తిగా రూపుమాపడం అంత సాధ్యం కాదు. ద్రవ్యోల్బణం అదుపులో లేకపోతే, ధరలు ఎప్పుడూ 'పై చూపు' మీదనే ఉంటే ఆర్థిక వ్యవస్థకు గ్రహణం పట్టక తప్పదు; ఎన్నో అనర్థాలు సంభవిస్తూ ఉంటాయి. వస్తుసేవల ధరలు నెమ్మదిగా, క్రమేణా కొన్ని సంవత్సరాల కాల వ్యవధిలో పెరిగితే మొత్తంమీద ప్రజలకు లాభం కలుగుతుంది. ఎందుకంటే ధరలు పెరగడంవల్ల లాభాలు పెరుగుతాయి. లాభాలు పెరగడంచేత ఉత్పత్తి అధికమవుతుంది. తత్ఫలితంగా ఉద్యోగావకాశాలు పెరుగుతాయి. ఉత్పత్తి అధికం కావడం వినియోగదార్లకు శ్రేయస్కరము. ఉద్యోగావకాశాలు లభించడం శ్రామిక వర్గానికి మంచిది. అయితే మన దేశంలో పరిస్థితి ఇందుకు భిన్నంగా ఉంది. ధరలు వేగంగా పెరుగుతున్నాయి. అందువల్ల కొంతమంది లాభాలు అంతకంటె వేగంగా పొందుతున్నారు. అయితే ఉత్పత్తి పెరుగుదల, ఉపాధి కల్పన అంత వేగంగా జరగడం లేదు. ధరల పెరుగుదల మూలంగా ఉత్పత్తిదార్లు, వర్తకులు, స్పెక్యులేటర్లు ఆర్జిస్తున్నారు. నిత్యావసర వస్తువుల కొరతవల్ల, ధరలు పెరిగిపోతూండటంవల్ల సామాన్య ప్రజలు ఎన్నో ఇబ్బందులు పడుతున్నారు. ద్రవ్యోల్బణానికి వారే హెచ్చుగా బలి అవుతున్నారు.

మధ్యతరగతి ప్రజలుకూడా ధరల పెరుగుదల వల్ల నానా ఇబ్బందులూ పడుతున్నారు. వారి ఆదాయాలు స్థిరమైనవి. కొనబోయే వస్తువుల ధరలు పెరుగుతూన్నవి. వారి కొనుగోలు శక్తి క్షీణిస్తూన్నది. అలవాటుపడిన వస్తువులను కొనే ఆర్థిక స్తోమత వారిలో క్షీణించడంవల్ల జీవనస్థాయి సహజంగా తగ్గిపోతూన్నది. పాలు, పంచదార, బట్టలు, టాయిలెట్ సామగ్రి మొదలైన నిత్యావసర వస్తువుల వినియోగాన్ని తప్పనిసరిగా తగ్గించుకోవాల్సిన దుస్థితికి వారు దిగజారిపోతున్నారు.

శ్రామికవర్గం (working class) సంగతి చెప్పనే అక్కర్లేదు. 1971 జనాభా లెక్కల ప్రకారం మన దేశంలో 18.05 కోట్ల మంది శ్రామిక జనాభా ఉంది. మొత్తం జనాభాలో వీరి శాతం 32.92. శ్రామిక జనాభా ద్రవ్యాదాయాలు స్థిరమైనవి. కాని పెరుగుతూన్న ధరలలో వారు నిత్యావసర వస్తువుల కొనుగోలుకు ఎక్కువ ఖర్చు పెట్టవలసి వస్తూన్నది. దానితో వారి జీవనస్థాయి నానాటికీ క్షీణించి పోతూన్నది. కొన్ని సందర్భాలలో కరువుభత్యం పెంపకం వల్ల శ్రామికులు ఎక్కువ వేతనాలు పొందవచ్చు. అయితే అధిక వేతనాలను శ్రామికులు పొందడానికి కార్మిక సంఘాల ద్వారా బేరాలు చేయవలసి ఉంటుంది. అవసరమైతే సమ్మెలు చేయవలె. ద్రవ్యోల్బణ పరిస్థితి మూలంగా మన దేశంలో కార్మికులు సమ్మెలు చేసిన సందర్భాలు అనేకమున్నాయి. తద్వారా పనిదినాల నష్టం ఎంతో సంభవించింది. కార్మిక సంఘాలలో (Trade Unions) చేరని కార్మికుల, వేతనాల పెంపును నోచుకోని కార్మికులు ఎన్ని అవస్థలు పడుతున్నారో వర్ణనాతీతము.

ధరల పెరుగుదల వల్ల ధనికులు ఎక్కువగా ధనవంతులైనారు. ఉదాహరణకు, వర్తకులు, పారిశ్రామిక వేత్తలు తమ వస్తువుల అమ్మకం ద్వారా ఎక్కువ లాభాలను గడించారు. వారు వస్తువుల కొరతను ఆలంబనగా చేసుకొని అక్రమ నిల్వల ద్వారా, బ్లాక్ మార్కెటింగ్ ద్వారా అక్రమ లాభార్జనలు పొందారు. అంతే కాకుండా భూస్వాములైన రైతులు వ్యావసాయికోత్పత్తులను పెంచి, ఆహార ధాన్యాలను నిల్వచేసి తమ ఉత్పత్తుకు అధిక ధరలు రాబట్టుకొని ధనార్జన చేయడం జరిగింది. ధరల పెరుగుదల ఫలితంగా ఉత్పత్తి, వర్తకపు వర్గాల ఆదాయాలు పెరిగిపోయినాయి.

ధరల పెరుగుదల ప్రభావాలను ఒక్క వాక్యంలో వర్ణించవచ్చు: "ధనికులు మరీ ధనికులయ్యారు; బీదవారు మరీ బీదవాళ్ళు అయ్యారు".

ధరల పెరుగుదలకు ఏయే రంగాలు ప్రభావితమయ్యాయో స్థూలంగా కింద వివరించడమైంది :

*1. రూపాయి విలువ పడిపోవడం :* ప్రస్తుతపు ద్రవ్యోల్బణ రేటు ప్రకారం సంవత్సరానికి 10 శాతం ద్రవ్యం విలువ తగ్గిపోతున్నదని ఒక అర్థ శాస్త్రజ్ఞుడు వ్యాఖ్యానించడం జరిగింది. 1955 సంవత్సరంలో మన రూపాయి విలువ 100 పైసలు ఉంటే, 1981 నాటికి 22 పైసలైంది రూపాయి విలువ ఎట్లా తగ్గుతూ వచ్చిందో కింది పట్టికద్వారా గమనించవచ్చు :

| సంవత్సరము | పైసలు |
|---|---|
| 1955 | 100 |
| 1960 | 79 |
| 1965 | 58 |
| 1970 | 43 |
| 1981 | 22 |

రూపాయి విలువ పడిపోవడానికి ధరల పెరుగుదల ఒక కారణంగా చెప్పుకోవచ్చు.

*2. ఉత్పత్తి* (Production) ద్రవ్యోల్బణ పరిస్థితుల వల్ల దేశంలో ఉత్పత్తి అటు వ్యవసాయ రంగంలోనూ, ఇటు పారిశ్రామిక రంగంలోనూ దెబ్బ తింటుందని చెప్పవచ్చు. ఎరువులు, విత్తనాలు, పెట్టుబడి మొదలైనవన్నీ ఖరీదు ఎక్కువ అవుతాయి. సామాన్య రైతులు ఎరువులను చాలినంతగా కొనలేరు. వడ్డీ రేటు ఎక్కువ కాబట్టి అప్పులు తెచ్చి పెట్టుబడి పెట్టలేరు. కాబట్టి వ్యావసాయిక ఉత్పత్తులపై ధరల పెరుగుదల ప్రభావముంటుంది. అదే విధంగా ద్రవ్యోల్బణ ప్రభావం పారిశ్రామికోత్పత్తుల పైన కూడా ఉంటుంది. పారిశ్రామిక సంస్థలు కొత్త యంత్రాలను కొనలేవు; పాత యంత్రాలను తొలగించి, వాటి స్థానే మంచి యంత్రాలను నెలకొల్పలేవు. మెయింటెనెన్స్ వ్యయం హెచ్చుగా ఉంటుంది. ముడి పదార్థాల వ్యయం అధికంగా ఉంటుంది. జీవన వ్యయసూచీ పెరగడంతో కరువు

భత్యం నిమిత్తం కార్మికులు డిమాండ్ చేస్తారు. కొన్ని సందర్భాలలో సమ్మెలుకూడా చేస్తారు. లాకౌట్లు ప్రకటించాల్సిన దుస్థితి ఏర్పడగలదు. తత్ఫలితంగా మనుష్య దినాలు (Man days) నష్టపోయి ఉత్పత్తి తగ్గిపోతుంది. ద్రవ్యోల్బణ ధోరణులలో పారిశ్రామిక సంస్థలో ఎక్కువ వడ్డీరేట్లను చెల్లించవల్సి ఉంటుంది. ఈక్విటీకి అప్పు నిష్పత్తి (debt - equity ratio) హెచ్చుతుంది. పారిశ్రామిక వేత్తలు అక్రమ లాభార్జనకు అడ్డదార్లు తొక్కుతారు. అసలు, నకిలీ ఖాతాలు మెయింటెయిన్ చేస్తారు.

3. *ఉత్పాదకత* (Productivity) : ధరల పెరుగుదల రేటు ఉత్పాదకతపై కూడా ప్రభావాన్ని చూపుతుంది. ఉత్పాదకత పెరుగుదల ఎంత తక్కువగా ఉంటే ద్రవ్యోల్బణ ప్రభావం అంత హెచ్చుగా ఉంటుంది. ఉదాహరణకు, ఒక కార్మికసంఘం ధరల పెరుగుదల సందర్భంగా వేతనాలలో 5 శాతం పెరుగుదలను కోరితే, 3% ఉత్పాదకత పెరుగుదల కింద అది మాయమవుతుంది. దీని అర్థమేమిటంటే యజమాని యొక్క శ్రామిక ఖర్చులు 2 శాతం పెరుగుతాయి. ఆ ఖర్చులను యాజమానులు వినియోగదార్లనుంచి రాబట్టుకోవడానికి ప్రయత్నిస్తారు. తత్ఫలితంగా ధరలు మరీ పెరగడానికి అవకాశ మేర్పడుతుంది.

4. *ఖాతాల కెక్కని ఆదాయాలు* (Unaccounted money) : ధరల పెరుగుదల పరిస్థితులలో ధరల పెరుగుదలను అరికట్టడానికి ప్రభుత్వం కొన్ని చర్యలు తీసుకోవలసింది. ఎక్కువ రేటులో పన్నులు విధించడం, డిపాజిట్ రేట్లపై సీలింగ్, డివిడెండ్ రేట్లపై పరిమితి విధించడం, మూలధన ఆర్జనలపై (capital gains) పన్నులు వేయడం మొదలైన చర్యలవల్ల వ్యాపారస్తులు, పారిశ్రామిక వేత్తలు రెండు రకాల ఖాతాలను మెయింటెయిన్ చేయడానికి ప్రయత్నిస్తారు. ఒకటి-పన్నుల అధికారులకు; రెండోది సొంతానికి; అభివృద్ధి చెందిన దేశాలలో కూడా ద్వంద్వఖాతాలు (dual accounts) మెయింటెయిన్ చేయడం కొత్త కాదు. కొన్ని వ్యవహారాలలో హెచ్చు లాభాలు ఆర్జించే అవకాశమున్నది. స్పెక్యులేషన్ నిమిత్తం వస్తువులను, వెండి, బంగారు నగలను దాయడం;

ఇళ్ళస్థలాలు, ఖాళీస్థలాలు, భవనాలు మొదలైన వాటిలో పెట్టుబడి పెట్టడం; ప్రభుత్వపు లైసెన్సులను, పర్మిట్లను సంపాదించడం - మొదలైన వ్యవహారాలలో అక్రమంగా, అధికంగా కొంతమంది లాభాలను ఆర్జించడం జరుగుతూన్నది. ఇట్లా లాభాలు ఆర్జించేవారు ద్వంద్వ ఖాతాలను నిర్వహిస్తూ, పన్నులు ఎగవేస్తూ ఉంటారు. ఖాతాలకెక్కని ఆదాయాలు భారీఎత్తున సమకూడటంవల్ల, ఆ ఆదాయాలు మళ్ళీ పన్ను ఎగవేత రంగాలలోకి పెట్టుబడిగా ప్రవహించడంవల్ల- అధికారిక ధరలకు (official prices), అసలు ధరలకు (actual prices) అగాధం ఏర్పడుతుంది. ఈ ప్రక్రియ విషవలయంగా తయారై అక్రమ ఆదాయాల పెంపుకు దారితీస్తుంది.

*5*. పంపిణీ (Distribution) : ధరల పెరుగుదల ప్రభావం వస్తువుల పంపిణీ విధానంపై కూడా చూపుతుంది. ద్రవ్యోల్బణ పరిస్థితులలో పంపిణీ విధానం సక్రమంగా జరగదు. వర్తకులు అధిక లాభార్జన కాంక్షతో అత్యవసర వస్తువు ను దాయడం జరుగుతుంది. బ్లాక్ మార్కెటింగ్‌కు ఎక్కువ అవకాశాలుంటాయి. పెద్ద పెద్ద రైతులు కూడా మంచి ధరలు లభిస్తాయనే తలంపుతో ఆహార ధాన్యాలను నిల్వచేయడం జరుగుతుంది.

*6*. స్థిరాస్తులు : ధరల పెరుగుదల ఫలితంగా వ్యవసాయ భూముల, నగర ప్రాంతాలలో ఖాళీస్థలాల, ఇళ్ళధరలు విపరీతంగా పెరిగిపోయినాయి. గత అయిదారు సంవత్సరాలలో ఈ ధరలు విపరీతంగా, ఊహాతీతంగా పెరిగినాయని చెప్పవచ్చు. హాంగ్ కాంగ్‌లో ఒక ఎకరం ఖాళీస్థలం 250 మిలియన్ డాలర్లకు అమ్మడం జరిగిందట. మన దేశంలో ఢిల్లీ, బొంబాయి, కలకత్తా, హైదరాబాద్ మొదలైన నగరాల్లో కూడా ఖాళీస్థలాలు, ఇళ్ళధరలు రెండింతలు, మూడింతలు పెరిగినాయి. కింది పట్టిక గమనించండి.

| నగరం | (చ.గ.) | 1975 | 1981 |
|---|---|---|---|
| | | రూ. | రూ. |
| ఢిల్లీ | | 750 | 2,500 |
| బొంబాయి | | 500 | 2,000 |

| | | |
|---|---|---|
| శ్రీనగర్ | 450 | 1,800 |
| కలకత్తా | 400 | 1,700 |
| లక్నో | 375 | 1,500 |
| అహమ్మదాబాద్ | 325 | 1,400 |
| హైదరాబాద్ | 275 | 1,100 |
| పూనా | 225 | 900 |
| ఇండోర్ | 200 | 800 |
| పాట్నా | 150 | 600 |
| మద్రాసు | 150 | 600 |
| త్రివేండ్రం | 140 | 575 |
| భూపాల్ | 120 | 550 |
| కొచ్చిన్ | 100 | 400 |

**మూలం :** ఇండియా టుడే, 1981 జూలై.

ధరల పెరుగుదల ప్రభావం అనేక రంగాలపైన, వస్తువులపైన ఉంది. అంతేకాకుండా మొత్తం ఆర్థిక వ్యవస్థ సంక్షోభానికి గురి అయ్యే ప్రమాదం ఏర్పడిందని చెప్పవచ్చు. కేంద్ర ప్రభుత్వపు బడ్జెట్ అంచనాలు క్రిందూ మీదయ్యే పరిస్థితి ఏర్పడింది. క్రమంగా దారిద్ర్య రేఖకు దిగువనున్న పేదల సంఖ్య కోట్లలో పెరిగిపోతూన్నది.

## ప్రభుత్వ ధరల విధానము (Price policy of the Government)

ధరలను అదుపులో పెట్టడానికి, క్రమబద్ధం చేయడానికి ప్రభుత్వం ఇటీవల ఎన్నో చర్యలు తీసుకొంటూన్నది. 1961 వరకూ ధరల విధానాన్ని కఠినంగా రూపొందించాల్సిన ఆవశ్యకత ప్రభుత్వానికి కలగలేదు. ఎందుకంటే – ధరల పెరుగుదల క్రమేణా జరిగింది; ధరల పెరుగుదల గురించి ప్రజల ఆందోళన లేదు. ధరలను అదుపులో పెట్టే కార్యభారాన్ని రిజర్వు బ్యాంక్ ఆఫ్ ఇండియాకు వొదిలివేయడం జరిగింది. అయితే 1962లో చైనా దురాక్రమణ

తర్వాత, 1966 క్షామ పరిస్థితుల తర్వాత ధరల పెరుగుదల వేగం ఎక్కువ కావడంతో ప్రభుత్వం ధరల విధానాన్ని అనుసరించాల్సిన ఆవశ్యకత కలిగింది. ధరల పెరుగుదలను అరికట్టడానికి ప్రభుత్వం కింది చర్యలను తీసుకుంది.

i) నగర ప్రాంతాలలో ప్రభుత్వం నిత్యావసర వస్తువుల పంపిణీ కోసం రేషనింగ్ విధానాన్ని ప్రవేశపెట్టింది. రేషన్ కార్డు లున్న వారికి బియ్యం, గోధుమ, పంచదార మొదలైన వస్తువులు కంట్రోల్ ధరలకు లభిస్తాయి. ప్రభుత్వం దేశ మంతటా చౌకధరల దుకాణాలను (Fair price shops) తెరిచింది. ఆంధ్రప్రదేశ్‌లో ఇట్లాంటి దుకాణాలు దాదాపు 24,000 వరకూ ఉన్నాయి. ఈ దుకాణాలు నిత్యావసర వస్తువులను కంట్రోల్ ధరలకు పంపిణీ చేస్తాయి. అయితే ఈ వస్తువులు ఓపెన్ మార్కెట్‌లో కూడా దొరుకుతాయి. కాని ధరలు హెచ్చు.

ii) పంచదార, వంటనూనెలు, వనస్పతి, సిమెంట్ మొదలైన వస్తువులకు ధరలు నిర్ణయించడం ద్వారా ప్రభుత్వం ధరల స్థిరీకరణకు చర్యలు తీసుకుంది. కొన్ని వస్తువుల విషయంలో ద్వంద్వ ధరల (dual prices) విధానాన్ని కూడా ప్రభుత్వం అనుసరించింది – చౌకధరలు పేదలకు, ఎక్కువ ధరలు డబ్బు గల వార్లకు, బలహీన వర్గాల వారికి చౌకధరల దుకాణాల ద్వారా సప్లయ్ చేయడం, ధనిక వర్గం వారు ఓపెన్ మార్కెట్‌లో వస్తువులు కొనుక్కోవడం.

iii) ఆహార ధాన్యాలను వర్తకులు అక్రమంగా నిల్వ చేసుకుండా ఉండటానికి, స్పెక్యులేషన్ వ్యాపారం చేయకుండా ఉండటానికి ప్రభుత్వం చర్యలు తీసుకుంది. నిర్ణీత పరిమాణానికి మించి ఏ వర్తకుడూ నిత్యావసర వస్తువులను నిల్వ చేయడానికి వీలులేదు.

iv) దేశీయ కొరతలను నివారించడానికి, ధరల అదుపు నిమిత్తం ప్రభుత్వం విదేశాలనుంచి భారీఎత్తున ఆహార ధాన్యాలను దిగుమతి చేసుకొంటూన్నది. గత మూడేళ్ళలో ప్రభుత్వం దాదాపు 30 మిలియన్ టన్నుల ఆహార ధాన్యాలను నిల్వ చేసింది. వాటిని ప్రభుత్వ పంపిణీ వ్యవస్థ ద్వారా ప్రజలకు సప్లయ్ చేయడమవుతుంది.

v) భారత ఆహార సంస్థ (Food Corporation of India) ద్వారా ప్రభుత్వం ఆహార ధాన్యాలు సమృద్ధిగా ఉన్న ప్రాంతాలనుంచి సేకరించి, కొరత ప్రాంతాలకు సరఫరా చేయించడం ద్వారా చర్యలు తీసుకొంటూన్నది.

vi) హెచ్చు పన్నులను విధించడం ద్వారా ప్రభుత్వం వినియోగ వ్యయాన్ని అరికడుతూన్నది. 1973 జూలైలో ప్రభుత్వం ఒక ఆర్డినెన్స్‌ను జారీచేసింది. దాని ప్రకారం డివిడెండ్లద్వారా వచ్చే ఆదాయాలను, అదనపు వేతనాలను, జీతాలను కొంత శాతం తప్పనిసరిగా డిపాజిట్ చేయవలసి ఉంటుంది. దీని ప్రధానోద్దేశం ద్రవ్యాదాయాలను తగ్గించడం, తద్వారా వస్తువులకు డిమాండ్‌ను తగ్గించడం, అదే సమయంలో రిజర్వు బ్యాంకుకూడా కొన్ని చర్యలు తీసుకొంది. బ్యాంకు రేటును పెంచింది. వాణిజ్య బ్యాంకులు అప్పులిచ్చే వడ్డీ రేటును ఎక్కువ చేసింది. దీనివల్ల ప్రజలు అప్పులు తీసుకోవడానికి భయపడ జొచ్చారు. ఇట్లాంటి ద్రవ్య, కోశ విధానాల వల్ల 1974లో ధరలు స్వల్పంగా తగ్గినాయిగానీ 1976 తర్వాత వాటి ప్రభావం అంతగా లేకపోయింది. 1981 లో ప్రభుత్వం బేరర్ బాండ్ల పథకాన్ని ప్రవేశపెట్టింది. ఈ పథకం కూడా ఆశించిన ఫలితాలను సాధించ లేదు.

ii) వ్యావసాయిక, పారిశ్రామిక ఉత్పత్తుల పెంపుదల కోసం ప్రభుత్వం ప్రణాళికాబద్ధమైన కృషి చేస్తున్నది. వస్తువుల

డిమాండ్‌ను తట్టుకోగల సప్లయ్‌ను సృష్టిస్తే ధరలు అదుపు లోకి రాగలవు. ధరల పెరుగుదల సమస్యకు అంతిమ పరిష్కారం వస్తువుల సప్లయ్‌ను పెంచడంలోనే ఉంది.

భారతదేశంలో ధరల పెరుగుదల పరిస్థితి ఆందోళనకరంగా ఉన్నదనే విషయం ప్రత్యేకంగా చెప్పనక్కర్లేదు. మన ఆర్థిక వ్యవస్థ అంత పటిష్టంగా లేదు. వ్యావసాయిక, పారిశ్రామిక రంగాలలో అనుకొన్న లక్ష్యాలను సాధించలేకపోతున్నాము. లోటుదారీ ఆర్థిక విధానపు అంకెలు సంవత్సరం సంవత్సరం పెరిగిపోతున్నాయి. 1980-81 సంవత్సరానికి లోటు బడ్జెట్ రూ. 1935 కోట్లుగా అంచనా వేయడమైంది. విదేశీ వర్తకపు శేషం పరిస్థితి అంత ఆరోగ్యకరంగా లేదు. ధరల పెరుగుదలను అరికట్టడానికి ప్రభుత్వం గతంలో తీసుకున్న, ప్రస్తుతం తీసుకుంటూన్న చర్యలు కాకుండా కింద పేర్కొన్న చర్యలు తీసుకోవాల్సిన ఆవశ్యకత ఎంతైనా ఉంది:

i) భూ సంస్కరణలను అమలు జరిపి, అందరికీ సమంగా భూమి లభించేటట్లు చేయవలె.

ii) మార్కెట్ యంత్రాంగాన్ని కంట్రోల్ చేయడానికి ప్రభుత్వ పంపిణీ వ్యవస్థను కట్టుదిట్టం చేయవలె.

iii) పెద్ద పెద్ద వ్యాపార సంస్థలు మరీ పెద్దవిగా పెరిగిపోవడాన్ని నిలుపు చేయవలె. వస్తువులలో గుత్తాధిపత్య ధోరణులను అరికట్టవలె.

iv) అభివృద్ధికి దోహదం చేయని ప్రభుత్వ వ్యయాన్ని సాధ్యమైనంత మేరకు తగ్గించవలె. పలు రంగాలలో ఈ వ్యయం హెచ్చుగా కనబడుతూన్నది. ఈ వ్యయాన్ని తగ్గించడానికి ప్రభుత్వం చర్యలు తీసుకోవలె.

v) విదేశీ సాంకేతిక విజ్ఞానాన్ని దిగుమతి చేసుకోవడంలో ప్రభుత్వం అవలంబిస్తూన్న ఉదార విధానానికి (liberal policy) స్వస్తి చెప్పవలె.

vi) ప్రజల ఆదాయాలలో ఉన్న వ్యత్యాసాలను తగ్గించడానికి ప్రభుత్వం చర్యలు తీసుకోవలె.

vii) ప్రభుత్వరంగ సంస్థలలో పెట్టుబడి కేటాయింపులను పెంచవలె. ఉత్పత్తి లక్ష్యాలమేరకు జరిగేటట్లు చూడవలె.

viii) ప్రజలూ, ప్రభుత్వమూ ఆడంబర వ్యయాన్ని (conspicuous consumption) తగ్గించుకోవలె.

ix) దేశంలోని నల్లధనాన్ని వెలికితీయడానికి ప్రభుత్వం కఠినమైన చర్యలు తీసుకోవలె.

x) ప్రత్యక్ష పన్నులను (direct taxes) ఎక్కువగాను, పరోక్ష పన్నులను (indirect taxes) తక్కువగాను ప్రభుత్వం విధించవలె.

xi) బ్యాంకులు అందించే పరపతిపై నియంత్రణ విధించవలె.

పైన పేర్కొన్న చర్యలు దాదాపు దీర్ఘకాలిక చర్యలు. ఆచర్యలను ప్రభుత్వం తీసుకొన్నప్పుడు దేశంలో ధరల పెరుగుదల తగ్గగలదు. ధరల పెరుగుదల అనేది దీర్ఘకాలిక వ్యాధి లక్షణాలు గలది. ధరల పెరుగుదలను తగ్గించడానికి దీర్ఘకాలిక ప్రాతిపదికపై సముచితమైన, నిర్మాణాత్మకమైన చర్యలు ప్రభుత్వం తీసుకోవలె. ప్రభుత్వం తీసుకొనే చర్యలకు ప్రజలు సహకారాన్ని అందించవలె. అప్పుడే దేశంలో ధరలు తగ్గుముఖం పడతాయి. మన ఆర్థిక వ్యవస్థ సుస్థిరమవుతుంది. దేశపు సర్వతోముఖాభివృద్ధికి అనుకూలమైన వాతావరణమేర్పడుతుంది.

# BIBLIOGRAPHY


**Books**

1. Growthless Inflation By means of Stockless Money — P. R Brahmananda
2. Inflation and the Theory of Money — R.J Ball
3. Inflation : Causes and cures with Special Reference to Developing Countries — M Banerjee
4. Price Behaviour in India — M. A. Srinivas
5. The Great Inflation — A. J Brown
6. Wage Inflation — J Burton
7. Inflation — J S Flemming
8. Inflation : A World-wide Disaster — Irving Friedman
9. Inflation in an Underdeveloped Economy : A study of India — Santikumar Ghosh
10. Inflation in Recession and Recovery — R J. Gordon
.11 The Menace of Inflation — Gyan chand
12. The Theory of Inflation : A Review — A. J Hagger
13. A Study in the Theory of Inflation — Bent Hausen
14. Prices and production — F. A. Hayek
15. Inflation and Society — Graham Hutton
16. The New Inflation : The Politics of prices and Income — Aubrey Jones
17. Essays on Money and Inflation — D.E W. Laidler
18. The Control of Inflation — G. Maynaid
19. Can Inflation be controlled ? — Harold Moulton
20. The Age of Inflation — Jacques Rueff
21. Inflation in India — S. L. N. Simha
22. Understanding Inflation and Unemployment — W. Allensmith
23. Poverty, Planning and Inflation — C. N. Vakil
24. Inflation — Thomas Wilson
25. Behaviour of prices in India — Santi Chakrabarti
26. The price system — Robert Dorfman
27. The Black Economy in India : Problems and Policies — K. K. Nayan

**Essays**


1. Inflation — J.K. Galbraith
2. Money and prices in India — B.S.R. Rao
3. Development and containment of Inflation in India : 1971-75 — N. V. Soyani
4. Thoughts on Inflation and Distribution — K. S Krishna swamy.
5. Inflation The Indian Experience — A. V. N. Iyengar
6. Price Rise, Price Rise — Narotham Shah
7. The Inflation Problem in Developing Economies — M. A. Akhtar
8. Monetary Theory in an Indian Setting — P R. Brahmananda
9. Analysis of Domestic Inflation: The Theory of Domestic Inflation — R. J. Gordon
10. Secular Inflation and the International Monetary System— H G. Jhonson
11. An Analysis of Inflation in India 1970-75 — V. Pandit
12. Price Behaviour in India, 1949-66 : An Explanatory Hypothesis — K. N. Raj
13. Analytical Aspects of Anti - Inflation policy — P A Samuelson and R. M. Solow
14. Monetary Theory and Policy — S. N. Sen
15. Prices, Money Wages and Real output - A case study of Indian Manufacturing Sector — M. A. Srinivas
16. The Relationship between P L 480 Transactions, Money Supply with the Public and prices - An Analysis — K. Shundaram


**Magazines**


Time
Commerce
Industrial Times
India Today
Illustrated Weekly of India
Yojana
Artha Vijnana
Political and Economic weekly
The Hindu
Business Standard